19.8.1994 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి: 66, సంచిక: 32, విడిప్రతి : రు 2.00లు

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి



# కృష్ణాపట్నం లంచం 45 కోట్లు?

కృష్ణాపట్నం విద్యుత్ కేంద్రం టెండర్ల గోల్మాల్‌ను ఇటు ముఖ్య మంత్రి, అటు ప్రధాన కార్యదర్శి గట్టిగా సమర్థించు కోవడం వెనుక బలమైన కారణం వుందని అందరి అనుమానం. ముఖ్య మంత్రి అల్లుడు ఒక కంపెనీకి ప్రతినిధిగా వ్యవహరించడం, ప్రధాన కార్యదర్శి బంధువు మరొక కంపెనీకి యజమాని కావడం ఒక్కటే ఇందులోని ఆశ్రిత పక్షపాత జబ్బుకు కారణం కాదు. ఎంత దగ్గరి బంధుత్వాలున్నా వంగ తోట కాడ మామా అని పిలిపించు కోవడానికి ఎవరూ రెడీగా లేరు. ఈ టెండర్ల ఆమోదానికి ఉన్నత స్థాయిలో 14 మిలియన్ డాలర్ల లంచం (దాదాపు 45 కోట్ల రూపాయలు) చేతులు మారిందని విశ్వసనీయ వర్గాల కథనం. టెండర్ల పరిష్కారం తుది దశలో అర్హత పొందిన వివిధ కంపెనీల నుంచి వారు ఇవ్వ గల్గిన లంచం మొత్తం ఎంతో ముందుగా అడిగి

## అమెరికన్ డాలర్లలో అమెరికాలోనే చెల్లింపు- ఎవరెవరి ఖాతాలో ఎంతెంత చేరిందో మరి!

తెలుసు కున్నారట. ఒక కంపెని 9 మిలియన్ డాలర్లు (29 కోట్లు) ఆఫర్ చేసిందట. అప్పటికదే పెద్ద మొత్తం కావడంతో ఆ కంపెనీకి గ్రీన్ సిగ్నల్ ఇస్తామని సంబం ధితులు హామీ ఇచ్చారట కూడా! వారు సంతోష పడి పోయి 9 మిలియన్లను ట్రాగు చేయడానికి అర్జెంటుగా అమెరికా విమానం ఎక్కారు. కానీ ఈలోగా ఇక్కడ ఈ రెండు కంపెనీలూ మారు బేరం నిర్వహించి, మొత్తాన్ని 14 మిలియన్లకు పెంచారట. దానితో సంబంధితులు మొదటి హామీ మర్చి పోయారు. బేరం సెటిలైన వెంటనే ఈ రెండు కంపెనీల వారు తాము చెప్పిన మొత్తాన్ని అమెరికాలో ఆయా అకౌంట్లలో డిపాజిట్ చేసేశారట. మొదట 9 మిలియన్లకు రేటు కుదుర్చుకున్న కంపెని ప్రతి నిధులు తిరిగి వచ్చే లోగానే జరగాల్సిం దంతా జరిగి పోయింది. ఇదేమి అన్యాయం, మీరు చెప్పిన మొత్తం ఇస్తామన్నాం కదా అని ప్రశ్నిస్తే - ''సారీ - కొంచెం లేటయ్యారు'' అనే సమాధానం వచ్చిందట. ఈ కొంచెం లేటులోని రేటు తేడా 5 మిలియన్లు (16 కోట్లు).

ఈ మొత్తం వ్యవహారం పై అమెరికాలోని ప్రవాసాంధ్రుల మధ్య చాలా అవమానకర తీరులో చర్చ జరుగుతూంది. నాయకుల అవినీతి గురించి వారు స్వేచ్ఛగా మాట్లాడు కుంటున్నారు. డబ్బు ఇస్తామని చెప్పి ఇవ్వలేక పోయిన వారు, ఇచ్చిన వారు కూడా తమ జయాప జయాలను ప్రచారం చేసు కొంటుండంతో కృష్ణాపట్నం విద్యుత్ కేంద్రం గురించి దాదాపు ప్రతి ప్రవాస ఆంధ్రుడికీ సమగ్రంగా తెలిసి పోయి వుందిప్పుడు.

ఒకే ఒక్క ఫైలుకు 45 కోట్ల రూపాయల లంచం అనేది మన రాష్ట్రంలో ఇప్పటి వరకు ఎవరూ వూహించని మొత్తం. చరిత్రలో ఎప్పుడూ ఇంత డబ్బు చేతులు

కొరవ 11 వ పేజీలో

# నివాళి



జననం: 8.7.1914 | మరణం: 11.8.1994

ఆత్మకూరు మాజీ సమితి అధ్యక్షులు
రైతు సంఘ నాయకులు, మా అభివృద్ధికి కారకులు
వితరణ శీలి

# శ్రీ పండ్లూరు వెంకట సుబ్బారెడ్డి గారు

11.8.1994 తేదీన స్వర్గధామం చేరినారు.
వారి దివ్యస్మృతులను అనుదినం స్మరించుకొంటూ
వారికి నివాళి సమర్పిస్తున్నాము.

## ఉత్తరక్రియలు

24.8.1994 - బుధవారం - శిలాప్రతిష్ఠ
25.8.1994 - గురువారం - శిలోద్వాసన
కోలగట్ల గ్రామంలో మా స్వగృహమున జరుగును.
కావున బంధుమిత్రులు తెలియ గోరుతాము

| | | | |
|---|---|---|---|
| పండ్లూరు గోపాలకృష్ణారెడ్డి | అనురాధమ్మ | జగదీష్‌రెడ్డి | భార్గవి |
| కుమారుడు | కోడలు | మనుమడు | మనుమరాలు |

| కుమార్తెలు | అల్లుళ్ల |
|---|---|
| శమంతమ్మ | సిద్ధారెడ్డి వెంకట వరదారెడ్డి (గుండాలమ్మపాళెం) |
| సత్యవతమ్మ | సి.వి. కృష్ణారెడ్డి, మాజీ సమితి అధ్యక్షులు, కోలగట్ల, ఆత్మకూరు. |
| శ్రీలక్ష్మమ్మ | అడపాల వెంకటరామిరెడ్డి, పార్లపల్లి |
| సుభాషిణమ్మ | దేవళ్ళ సుబ్బారెడ్డి, మోడేగుంట |
| సీత | ఎ. యిరాలి, మద్రాసు |
| కుసుమమ్మ | కోటంరెడ్డి కోదండరామిరెడ్డి, వవ్వేరు |

మరియు మనుమలు - మనుమరాండ్రు

# సింహగర్జన

బి

ఎర్రకోట బురుజుల పైనుంచి భారత ప్రధాని శ్రీ పివి నరసింహారావు చేసిన సింహగర్జన ప్రతి భారతీయునికీ వీనుల విందుగా విన్పించింది. స్వర్గీయ ప్రధాని ఇందిరా గాంధీ తర్వాత పాకిస్తాన్ ముష్కరులకు ఇంత నిర్భయంగా, నిశితంగా, సూటిగా హెచ్చరిక పంపిన [illegible] పివి ఒక్కరే! పాకిస్తాన్ ఆక్రమణలో వున్న కాశ్మీర్ భూభాగాన్ని విడిపించి భారత్‌లో అంతర్భాగం చేయడమే తమ లక్ష్యమని ప్రకటించడం ద్వారా పివి నరసింహారావుగారు ఆ దేశ నాయకుల వెన్నులో చలి పుట్టించారు. ఎప్పుడూ కోపం, తాపం కన్పడనివ్వకుండా సామరస్య సంధి విధానాల ద్వారా సమస్య పరిష్కారానికి మొగ్గుచూపే పివి, ఒక్కసారిగా ప్రళయ కాల రుద్రుడివలె కయ్యానికి పై అన్నట్లు సింహగర్జనలు చేయడం విస్మయకరం, విచిత్రం. పరమ శాంత స్వభావుడైన ఆయనే అంతగా రెచ్చిపోయారంటే, పాకిస్తాన్ విద్రోహ చేష్టలు ఎంతగా శృతి మించిపోతున్నాయో అర్థం చేసుకోవచ్చు.

కాశ్మీర్ లోయలో పాకిస్తాన్ ప్రభుత్వం పచ్చిగా తీవ్రవాదాన్ని ప్రోత్సహిస్తున్నది. ఇదివరకు తెరమాటున, పైగా జరిపిస్తుండిన విచ్ఛిన్నకర కార్య కలాపాలను ఇప్పుడు పబ్లిక్‌గా నిర్వహిస్తున్నది. తీవ్ర వాదులకు ఆయుధాలు, అత్యంత ప్రమాద కరమైన బాంబులు, రాకెట్లు అంద జేయడంతో పాటు, ఆఫ్ఘనిస్తాన్ నుంచి కిరాయి సైనికులను, ఐఎస్ఐ ఏజెంట్లను దొంగ చాటుగా కాశ్మీర్ లోయలోకి దించి నర మారణ హోమం సృష్టిస్తున్నది. ప్రకృతి రమణీయకతకు ప్రతి రూపమైన ఆ అందాల సీమ పై రక్తపు మరకల మాలిన్యాన్ని పులుము తున్నది. ఇంకొక ప్రక్క అంత ర్జాతీయ వేదికల పై తరచు ఈ సమస్యను ప్రస్తావించి ప్రపంచ దేశాల ఎదుట భారత్‌ను దోషి వలె నిలబెట్ట డానికి ప్రయత్నిస్తున్నది. ఇవన్నీ చాలవ న్నట్లు పాకిస్తాన్ ప్రధాని శ్రీమతి బెనజీర్ భుట్టో తమ దేశ స్వాతంత్ర్య దినోత్సవ ప్రసంగంలో కాశ్మీర్‌లో ప్లెబిసైట్ జరపాలని పిలుపు నిచ్చారు. సరిహద్దు కివల, అదే సమయంలో భారత ప్రధాని సిమ్లా వప్పందం గురించి ప్రస్తావిస్తూ, స్నేహ [illegible] చేయి చాస్తున్న సమయంలో ఆమె [illegible] గొట్టె ప్రసంగం చేసింది. ఈ కవ్వింపు [illegible] పివిలో కోపాగ్నిని రగిలించి నట్లుంది. ఎర్రకోట బురుజుల నుంచి ఆయన ఆ ప్రక్క రోజే నిప్పులు కురిపించారు.

కాశ్మీర్‌లో తీవ్రవాద సమస్యతో ఆగకుండా, పాక్ ఆక్రమిత భూభాగాన్ని తిరిగి స్వాధీనం చేసు కోవడమే తమ ధ్యేయమని ప్రకటించడం ద్వారా, ఆయన పాకిస్తాన్‌కు తిరుగులేని హెచ్చరిక విన్పింప జేశారు. పాకిస్తాన్‌తో తలపడి, యుద్ధంలో ఓడించి అయినా సరే భారత దేశ సార్వభౌ మత్వాన్ని పరి రక్షిస్తామన్న దృఢ నిర్ణయం ఆ హెచ్చరికలో అంతర్లీనంగా ధ్వనిస్తున్నది. ఇప్పుడున్న ప్రపంచ ఆర్థిక, రాజకీయ పరిస్థితులలో ఇంతటి తీవ్ర బెదరింపు చేయడానికి పి.వి. ఎంతో సాహసించి వుండాలి. అట్లని ఆయన దేశాన్ని యుద్ధానికి సన్నద్ధం చేస్తున్నాడని కాదు; యుద్ధానికైనా తాము సిద్ధమేనన్న కృత నిశ్చయాన్ని వైరి వర్గానికి తెలియ జెప్పడమే ప్రధాని అభిమతం. పివి వంటి సాత్వికుడు, రాజకీయ వాణక్యుడు అంత అనాయకంగా యుద్ధ ప్రేలాపనలు చేయడు.

అయితే పాకిస్తాన్ విద్రోహ చర్యలను ప్రతి ఘటించ డానికి కేవలం హెచ్చరికలు, బెదరింపులు చాలవు. కాశ్మీర్ ప్రజల మద్దతు, సహకారం వుంటే తప్ప ఏమీ జరగదు. భారత ప్రభుత్వం ముందుగా కాశ్మీర్ లోయలో ప్రజాస్వామ్య ప్రక్రియ ప్రారంభించాలి. ఐదున్న రేళ్లుగా అమలులో వున్న రాష్ట్రపతి పాలనను నిలిపి వేసి ప్రజా ప్రభుత్వం స్థాపించాలి. తీవ్ర వాదుల తుపాకీలకు భయపడి నోరు కొట్టుసుకొని వున్న భారత దేశాభి మానుల వాణి ప్రపంచానికి విన్పించే పరిస్థితులు కల్పించాలి. స్థానిక ప్రజల సహకారం, సానుభూతి, నిమగ్నత లేకుంటే ప్రభుత్వం తలపెట్టే ఏ చర్యా సఫలం కాదు.

కాశ్మీర్ సమస్య ఒక్క ఆ రాష్ట్రానికి సంబంధించింది కాదు. యావత్ దేశపు సమగ్రత, స్థిరత్వం ఆ రాష్ట్రం పై ఆధార పడి వున్నాయి. భౌగోళికంగా అత్యంత కీలకమైన ప్రాంతమది. అటువంటి ప్రదేశం ఇంత సుదీర్ఘ కాలం అస్థిరత్వానికి లోనై, అల్ల కల్లోలంగా వుండడం దురదృష్ట కరం. పంజాబ్, అస్సాం సమస్యలను అవలీలగా పరిష్కరించిన పివికి, ఇదేందు వల్లో కొరుకుడు పడడం లేదు. కాశ్మీర్ ప్రజలు కూడా తీవ్ర వాద సమస్యతో విసిగి పోయి వున్నాయి. విహార యాత్రికుల పై ఆధార పడిన వారి జీవన [illegible] ఛిన్నమై పోయి వుంది. [illegible] ఆకలి మంటలతో అల్లాడి పోతున్నారు. ప్రభుత్వం చిత్తశుద్ధితో పని [illegible] వారిలో విశ్వాసం కల్గిస్తే, కాశ్మీరీయులు ఆ సుందర లోయలో శాంతి స్థాపనకు సహకరిస్తారు. బిజెపి వంటి పార్టీలు కూడా సంకుచిత స్వార్థ రాజకీయ ప్రయోజ నాలను ప్రక్కన బెట్టి విశాల దేశావ సరాలను దృష్టిలో వుంచుకొని వ్యవహ రించాలి; ప్రభుత్వానికి పూర్తి మద్దతు ఇవ్వాలి.

పాకిస్తాన్ కుటిల యత్నాలను త్రిప్పి కొట్టడంలో కఠినంగా వ్యవహరిస్తా మని ఖండితంగా తెల్పి చెప్పి, దేశ ప్రతిష్టను ఇనుమడింప జేసిన ప్రధాని పివిని మనసారా అభినంది స్తున్నాము.

జమీన్‌రైతు

# అన్నిటికీ ఎమ్మెల్యేను విమర్శించడమేనా?

విజయ మహల్ గేటు వద్ద బాక్స్ సైపు బ్రిడ్జి సత్వర నిర్మాణానికి ప్రజాందోళనకు, ప్రజా ప్రతినిధుల చేయూత కూడా వుంది. అందువల్లే పని తొందరగా పూర్తయ్యింది. కాని ఇక్కడ అప్రోచ్ రోడ్ల నిర్మాణం సాంకేతిక కారణాల వల్ల నిలచి పోయి వుంది. దీనికి కారణం ఎమ్మె, ఎమ్మెల్యేలని విమర్శించడం తగదు. జె.కె. రెడ్డి నియోజక వర్గ అభివృద్ధి నిధుల్లో తొలిసారి మొత్తాన్ని ఈ బ్రిడ్జికే కేటాయించారన్న విషయం మరవ కూడదు.

నెల్లూరు -పి. అరుణమ్మ

## ప్రజలు మళ్లీ వుద్యమించాలి

సంపూర్ణ మద్య పాన నిషేధమే ప్రభుత్వ లక్ష్యమని పలుమార్లు ప్రకటించు కొన్న ప్రభుత్వం తన మాటమీద తాను నిలబడడం లేదు. చీప్ లిక్కర్‌ను నిషేధించక పోతే సంపూర్ణ నిషేధంగాని, సారా నిషేధంగాని విజయ వంతం కావు. చీప్ లిక్కర్ పై ప్రజల విమర్శ నాస్త్రాలను భరించ లేక రాష్ట్ర ప్రచార కమిటీ అధ్యక్ష పదవికి శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య రాజీనామా చేయడం జరిగింది. సారాను నిషేధిస్తూ సాహసో పేతమైన నిర్ణయాన్ని తీసుకో గలిగిన ముఖ్యమంత్రి పూర్తి మద్యపాన నిషేధాన్ని ప్రకటించాలి. లేకుంటే గతంలో వుద్యమానికి ఊపిరి పోసిన వారందరూ ఏకమై మళ్లీ వుద్యమించ వలసిన అవసరం వుంది.

నెల్లూరు. -ఆచార్య పిసి రెడ్డి.

## భ్రూణ హత్యలు ఆపాలి

గర్భస్థ శిశువు ఆడో, మగో నిర్ధారించే ఆధునిక వైద్య విజ్ఞానం దుర్వినియోగం కాకుండా నిరోధించే బిల్లు పార్లమెంటులో ప్రవేశ పెట్టడం హర్షణీయం. మానవత్వం గల ప్రతి ఒక్కరూ ఈ బిల్లుకు మనసారా మద్దతు తెలపాలి. స్కానింగ్ వైద్య విధానంతో భ్రూణ హత్యలకు పాల్పడే వారిని, అందుకు తోడ్పడే డాక్టర్లను కఠినంగా శిక్షించాలి. ఆడైనా, మగైనా ఒకటేనని సమీకృత ప్రచారం ద్వారా ప్రజల్లో చైతన్యం తీసుకు రావాలి.

-వి. ఉమామహేశ్వర రావు

వెంకటగిరి

**జనవాణి**

## ఫ్లాట్ ఫారంపై రైళ్లు నిలబడడంలేదు

నెల్లూరు రైల్వేస్టేషన్‌లో ఒకటవ నంబరు ఫ్లాట్ ఫారంపై గత కొన్ని రోజులుగా రైళ్లు నిలబడడం లేదు. కారణమడిగితే రైళ్లకు ఆలస్య మవుతున్నదని, లూప్ లైన్లలో నిలపరాదని రైల్వేబోర్డు ఆదేశాలు జారీచేసినట్లు చెబుతున్నారు. ఒకటవ నంబరు ఫ్లాట్‌ఫారం మద్రాసు నుండి రావడానికి, హైదరాబాదు వైపు పోవడానికి ఎంతో ఉపయోగకరంగా వుండింది. దాన్ని రద్దు చేయడంవల్ల ప్రయాసతో, అండర్ గ్రౌండ్ దారిలో పోవాల్సి వస్తున్నది. ఫ్లాట్‌ఫారం రద్దు చేయడం వల్ల ప్రజలకు నష్టమేగాని లాభమేమిటి? ప్రజానాయకులు ఈ విషయంలో చొరవ తీసుకొని తిరిగి ఫ్లాట్‌ఫారంను పునరుద్ధరించ వలసి వుంది.

నెల్లూరు -ఎ.ఎన్.ప్రభాకరరావు

## సాయి మందిరం పై విమర్శలు తగవు!

12 తేది జమీన్‌రైతు జనవాణి శీర్షికలో నెల్లూరులోని సాయిబాబా మందిరానికి గత ఐదు సంవత్సరాల నుండి రిపేర్లు చేస్తున్నట్లు ఒక మిత్రుడు వ్రాశారు. కానీ వాస్తవంగా మందిరానికి రిపేర్లు మొదలెట్టి ఇంకా రెండు సంవత్సరాలు కూడా కాలేదు. నిర్మాణపు పనులవల్ల మందిర నిత్య విధులకు ఏ మాత్రం భంగం కల్గడం లేదు. మందిరానికి వచ్చే కొద్ది మంది పోకిరీల చేష్టలను అరి కట్టేందుకు పోలీసుల సహాయం తీసుకొంటున్నాము. దైవ దర్శనానికివచ్చే ప్రతి విద్యార్థినీ అను మానించడం ఎంత మాత్రం సబబు చెప్పండి? ఆలయంలో నిత్య

కొరవ 8వ పేజిలో

**50 ఏళ్లక్రితం ఈవారం**

18 -8 - 1944

పేజీలు : 6 వెల : 0-1-6

## నెల్లూరుముచ్చట్లు

### వి.ఆర్.కాలేజి

ప్రిన్సిపాల్ యింకారాలేదు. రేపో మాపో రావచ్చు. కె. సుబ్రంహ్మణ్యం గారిని గూడ రామకృష్ణ మిషన్‌వారు యీ పనలేకి వదల నిష్టపడనందున ఆయనరాదు. హిందీ బోధకుడు గూడ రాడట.

* * *

కమిటీ సభ్యుల ఎన్నిక జరిగింది. 4స్థానాలకు 6గురు పోటీజేశారు. నా లెక్కం ప్రకారం 4గురు గెల్చి ఇద్దరు ఓడారు.

| గెల్చినవారు | ఓట్లు |
|---|---|
| 1. ఎ.సి. సుబ్బారెడ్డిగారు | 651 |
| 2. నుంకు చెంగన్నగారు | 633 |
| 3. వంగల్లు కోదండరామరెడ్డిగారు | 622 |
| 4. అల్లారెడ్డి శంకరరెడ్డిగారు | 609 |
| **ఓడినవారు** | |
| 5. కా.రా. నాథంగారు | 247 |
| 6. పి.వి.సుబ్బారెడ్డిగారు | 40 |

అసలు ఓటర్లంతా 962మంది. ఇందులో ఓటు చేసినవారు 855గురు, ఓటు చెయనివారు107 మంది మాత్రం.

ఎన్నికలలో మొదటి నల్గురు గెలిచారు. ఓడిన వారిద్దరు వేరు వేరు కోర్టులో వేసిన దావాలు నిల్వలో ఉన్నవి.

రాజాగారికి మాహిత వేమిటంటే దక్షులు, సమర్థులు, నిష్పాక్షికులయిన వ్యక్తులను నామినేట్ చేయమనీ, అట్లే కో అప్ట్‌లోగూడా సహాయపడమని మా యభిమతం.

* * *

### కస్తూరిదేవి హైస్కూలు

మద్రాసులో మన నెల్లూరువాసి, కె.యస్.కేసరి (కేసరి కుటీరాధిపతి) గారు [illegible] హైస్కూలు స్థాపించారు. భగీరథ ప్రయత్నం జేసి ప్రభుత్వానుమతి సంపాదించారు. ఆ స్కూలులో 1,2ఫారాలు చదువు 12మంది బీదబాలికలకు ఉచిత వేతనము, పుస్తకాలు యిచ్చారు. మరిన్ని

కేసరిగారు అక్కడ చదివే బాలికల కందరికి మధ్యాహ్నం పూట ఉచిత భోజనపు ఏర్పాట్లుగూడా జేస్తున్నారు.

నెల్లూరు జిల్లాలో ఎందరో రెడ్లు మున్నగు జాతుల్లో వదాన్యశేఖరులున్నారు. మన కస్తూరిదేవి బాలికా హైస్కూలులో గూడా అట్టి ఉచిత భోజన ఏర్పాట్లు మున్నగువాటికి అహమహమని ముందుకొచ్చి తమ ధనానికి సార్థకత కలిగించుకొంటారని మా ఆశయం.

దాతకు ఉత్తమ పాత్ర దొరకడం పూర్వజన్మ సుకృతంగదా; దాతలారా ముందుకు రండి!

### అధికార వర్గం

జిల్లాజడ్జి జార్డిన్‌గారు తిరుచునాపల్లికి ట్రాన్సుఫరు కాబడి వారిస్థానే యం.యే.అజీం సాహెబ్ గారు 14 తేది చార్జి తీసుకొనిరి.

జార్డిన్‌గారు మంచివారు. న్యాయాన్వేషణాభిలాషులు. కాని సివిల్ కేసులు రిపోస్టింగులేగాని ఎన్నాళ్లకు తగవు. అయితే 4 సం.లుగా అనవసర క్రోధాలు లేకుండా నిష్పాక్షికంగా పాలించినందుకు ధన్యవాదాలు.

### అవీ-ఇవీ

ఆంధ్రసెనెటుకు పొణకా గోవిందరెడ్డిగారు పోటీలేకుండానే

కొరవ 10వ పేజిలో

# ముస్లింలు కలసి వుంటే సాధించలేనిదేదీ లేదు!

ఇటీవల జిల్లాలో కులమత సంఘాల సభలు ఎక్కువై పోయాయి. ఎన్నికలు దగ్గరపడే కొద్దీ ఏ కులానికా కులం, ఏ మతానికా మతం వారు సభలు పెట్టి బల ప్రదర్శనలకు సిద్ధపడుతున్నారు. 16తేది టౌన్‌హాల్‌లో ముస్లింల మహాసభ జరిగింది. టౌన్‌తోపాటు జిల్లాలో కూడా ముస్లింలు పెపెద్ద సంఖ్యలో వున్నా వారిని సమీకరించడంలో నిర్వాహకులు పెద్ద వుత్సాహం ప్రదర్శించక పోవడంవల్ల సాదాసీదాగా సభ జరిగింది. కావలి నుండి మాత్రం పెద్ద సంఖ్యలో కార్యకర్తలు తరలి వచ్చారు. ఇఫ్కో ఛైర్మన్ శ్రీ పెళ్ళకూరు రామచంద్రారెడ్డి, ఎమ్మెల్యే జెకెరెడ్డి, ఆనం వివేకానందరెడ్డి, దేవకుమారెడ్డి, సుశీల్ కుమారెడ్డి, హాజీ మహమ్మద్ హైదర్, షేక్ మస్తాన్, ఎం.ఎ ఖాదర్, తదితరులు వేదికపై ఆశీనులయ్యారు.

ఎమ్మెల్యే జెకె రెడ్డి మాట్లాడుతూ జిల్లాలోని ముస్లింలు అన్నిరంగాల్లో చాలా వెనుకబడి వున్నారని, పట్టణ ప్రాంతాల్లో 90శాతం మందిదారిద్ర్యరేఖకు దిగువన వున్నారని వారి అభివృద్ధికి అందరు కలసి పనిచేయాలని అన్నారు. సమస్యల సాధన కోసం ముస్లింలందరూ సంఘటితం కమ్మని ఎమ్మెల్యే సలహా యిచ్చారు. ఇఫ్కో ఛైర్మన్ శ్రీపెళ్లకూరు రామచంద్రారెడ్డి మాట్లాడుతూ రాష్ట్రంలో ముస్లింలంతా కలిసి మెలసి వుంటే వారు సాధించలేనిది ఏదీ లేదన్నారు. తనకు 1942 నుంచి ముస్లింలతో సత్సంబంధాలు వున్నాయని చెబుతూ హిందూ ముస్లింలు సోదర భావంతో మెలగాలని కోరారు. ముస్లింలు ఆర్థికంగా సామాజికంగా వెనుకబడి వున్నారంటూ, వారి సంక్షేమానికి ఇఫ్కో ఛైర్మన్‌గా సహకరిస్తానని వాగ్దానం చేశారాయన. జిల్లా వక్ఫ్‌బోర్డ్ అధ్యక్షుడు మహమ్మద్ హైదర్ మాట్లాడుతూ ముస్లింలలోని అన్ని శాఖలకు రాష్ట్ర ప్రభుత్వం 20శాతం రిజర్వేషన్లు కల్పించాలని కోరారు. న్యాయవాదులు ఎస్.ఎం.సైదా, ఇస్మాయిల్ తదితరులు సభలో మాట్లాడారు. కావలికి చెందిన మైనారిటీ నాయకుడు షేక్ మస్తాన్ సాహెబ్ సభకు అధ్యక్షత వహించారు.

## నెల్లూరు సంగతులు

### జాతీయ స్థాయిలో వ్యాసరచన పోటీలు

ఆంధ్రరాష్ట్ర 41 వ ఆవిర్భావ వుత్సవాలను పురస్కరించుకొని మదరాసులోని అమరజీవి పొట్టి శ్రీరాములు మెమోరియల్ సొసైటీ జాతీయ స్థాయిలో వ్యాసరచన, వక్తృత్వ పోటీలు నిర్వహిస్తుంది. వ్యాసరచన పోటీకి అంశం వాతావరణం కాలుష్యం-పరిరక్షణ. పది అర తావులకు మించని వ్యాసాలను సెప్టెంబర్ 10తేదిలోగా పంపాలి. ప్రజాస్వామ్యం- మన శాసన సభల తీరు తెన్నులు అనే అంశంపై వక్తృత్వ పోటీ సెప్టెంబర్ 10 తేది జరుగుతుంది. పోటీలో పాల్గొనదలచినవారు ఆగస్టు 31తేదిలోగా దరఖాస్తులు పంపుకోవాలి. ఇతర వివరాలకు వైఎన్ శాస్త్రి, కార్యదర్శి, పొట్టిశ్రీరాములు మెమోరియల్ బిల్డింగ్, 126, ఆర్.హెచ్.రోడ్ మైలాపూర్, మద్రాసు4 అన్న చిరునామాకు వ్రాసి తెలుసుకోవచ్చు.

### సిటిజన్ క్లబ్ స్వాతంత్ర్య దినోత్సవం

48వ స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకుని సిటిజన్స్ క్లబ్ అధ్యక్షుడు శ్రీ వి. ఉదయభాస్కరరావు దర్గామిట్ట సాధన పబ్లిక్ స్కూల్‌లో పతాక ఆవిష్కరణ చేశారు. అనంతరం క్లబ్ సభ్యులు విద్యార్థిని, విద్యార్థులకు మిఠాయిలతో పాటు వివిధ పోటీలలో గెలుపొందిన వారికి బహుమతులు పంచిపెట్టారు. కార్యక్రమంలో జి. శ్రీనివాసరావు, రాఘవరావు, బి.వి.ఎన్. బాబు,వెంకటేశ్వరరావు, మోహన్‌రావు, మల్లిఖార్జునరావు, సుబ్బారావు, సాధన పబ్లిక్ స్కూల్ కరస్పాండెంట్ సి. నరశింహారావు పాల్గొన్నారు.

శ్రావణ మాసం, స్వాతంత్ర్య దినాలను పురస్కరించుకొని సిటిజన్స్ లెడీస్ క్లబ్ తమకు తగ్గ కార్యక్రమం ఏర్పాటు చేసుకొన్నది. టౌన్‌లోని

కొరవ 10వ పేజిలో

లేబూరు పాండురంగారెడ్డి కుమార్తె జ్యోతి; చింతోపు మాగుంట రాఘవ కుమారుడు వసంత్‌కుమార్ వివాహం 12 తేది టౌన్‌హాల్‌లో జరిగింది.

## సణుగుడు

### * ఆనం వారిని పెంచుతున్నారు!
### * అమెరికా ఒక మేడి పండు!

జిల్లాలో పదకొండు నియోజక వర్గాలున్నాయి. కాని రాజకీయ వాదులంతా వాటిలో పదింటిని మర్చి పోయారు. ఒక రాపూరును పట్టుకొని వూగు లాడుతున్నారు. ఎక్కడ నలుగురు చేరినా అదే చర్చ. పత్రికల్లోనూ అదే రచ్చ. వేరే ధ్యాస లేదు, వేరే వూసు లేదు. చదివే వారికి, వినే వారికి కూడా విసుగు పుట్టి పోతూంది.

ఇంత రచ్చకు కారణం - మాగుంట సుబ్బరామ రెడ్డి గారి సింగిల్ పాయింట్ ప్రోగ్రాం. ఆనం వంశ నాశనమనే ప్రతిన బూని పరశు రాముడి వలె గొడ్డలి భుజాని కెత్తుకొని తిరుగు తుండడంతో రాపూరు ఇంత లైమ్ లైట్‌లోకి వచ్చేసింది. కానీ దురదృష్టవ శాత్తు సుబ్బరామ రెడ్డి గారికి శల్యుల సారథ్యం. శకునుల మంత్రాంగం తప్ప నిజమైన, నికరమైన రాజకీయ పథక రచన చేసే వారెవరూ దొరికినట్లు లేదు. ఆయన రాపూరులో

#### డోచేంద్ర

పట్టిన చేపలన్నీ ఎరను మ్రింగి, వల నుంచి జారి పోతున్నాయి. పెంచలు కోన ట్రస్టు బోర్డు ఛైర్మన్ పదవి ఇప్పించ దానికి భూమ్యాకాశాలు ఏకం చేసి, విజయం సాధిస్తే పదవిలో కూర్చున్న మరుక్షణం తెప్ప తగలేసి బోడి మల్లయ్యా అని తృణీకరించి జారుకున్నాడు పాపకన్ను జయచంద్రా

కొరవ 7వ పేజిలో

## జిల్లా వార్తలు

# వైరస్ తెగుళ్ళ పట్ల దుష్ప్రచారం!

జిల్లాలో రొయ్యల పరిశ్రమ మనుగడ సందేహిస్తూ ఒక విష ప్రచారం జరుగుతున్నది. వైరస్ తెగుళ్ళు జిల్లాలోకి వ్యాపించాయని, మొత్తం పరిశ్రమను భస్మీపటలం చేయనున్నాయని అగుపడగా వుంది. కొత్తగా ఈ పరిశ్రమలో పెట్టుబడి పెట్టాలనుకునేవారు భయపడి దూరంగా పారిపోతున్నారు. ఇప్పటికే అందులో వున్నవారు ఏమైపోతామోనన్న ఆందోళనతో సతమతమౌతున్నారు. పరిశ్రమ ఎంత స్పీడుగా అభివృద్ధి చెందిందో, పతనమూ అంతే వేగంగా వుంటుందన్న అభిప్రాయం అక్కడక్కడా విన్పడుతూంది.

కాని వాస్తవ పరిస్థితి అధ్యయనం చేస్తే ఇవన్నీ పట్టి దుష్ప్రచారాలు. కండ్లేటి గట్టున వుండే రొయ్యల చెరువులలో తెగుళ్ల సోకడం, కొందరు రైతులు నష్టపోవడంతో ఈ పుకార్లు వ్యాపిస్తున్నాయి. జిల్లా ఆర్థిక వ్యవస్థను అమోఘంగా మార్చివేయగల ఒక అద్భుత పరిశ్రమ మనుగడకు అవరోధంగా పరిణమిస్తున్నాయి. కండ్లేరు క్రింద సాగయ్యే రొయ్యల చెరువులకు తెగుళ్ల బాధ తప్పదన్న సంగతి మొదటినుంచి అందరికీ తెలుసు. కాని, కళ్లముందు రెపరెపలాడే లాభాల కరెన్సీ నోట్ల భ్రమలో రైతులు ఆ నిష్ఠుర నిజాన్ని విస్మరించి, కాలుష్య నివారణకు ఏమాత్రం శ్రద్ధ చూపకుండా– ఈ పరిస్థితి తెచ్చుకున్నారు. అయితే అంత మాత్రాన్నే పరిశ్రమకు చావు మూడిందని భావించడం తొందరపాటు. కండ్లేటి చెరువుల్లో రొయ్యల చావుకు కారణభూతమైన తెగుళ్ల నివారణ వీలుకాని వైరస్ సంబంధమైనవి కావు; చికిత్సకు అలవియ్యే జబ్బులే! మొదట మొదట జబ్బులోకి, చచ్చిన రొయ్యలను రైతులు నిర్లక్ష్యంగా ఏటిలో పారబోయడం వల్ల వ్యాధి విస్తృతమై, అందరూ నష్టపోయారు. కొన్ని పెద్ద కంపెనీలు ఇన్సూరెన్స్ కోసం దీనిని వైరస్‌గా చిత్రించి రైతులలో భయాందోళన పెంచుతున్నాయి. ఎన్ని చెరువులు దెబ్బతిన్నా, ఎందరు రైతులు నష్టపోయినా కండ్లేరు ఇప్పటికీ రొయ్యల పరిశ్రమకు కీలకమైన నీటివనరు క్రిందే లెక్క. అదేమీ నిష్ప్రయోజనం కాలేదు. ఇంతకంటే కలుషితమైన జలాలలో రొయ్యలను పెంచే ఆధునిక సాంకేతిక ప్రక్రియలు ఇతర దేశాలలో అభివృద్ధి చెందివున్నాయి. ఆ పరిజ్ఞానం తెచ్చుకోవడం పెద్ద కష్టతరమైన విషయం కాదు. రైతులు అనవసర అనుమానాలు, దుష్ప్రచారాలకు లోబడితే తాము నష్టపోవడమే కాక, పరిశ్రమనే దెబ్బతీసిన వారౌతారు.

## ఎందుకింకా కావలి దీక్షలు?

కావలి ఆర్డీవో ఆకస్మిక బదిలీని రద్దు చేయాలని ఐక్య కార్యాచరణ కమిటీ గత నెల రోజులుగా చేస్తున్న రిలే నిరాహార దీక్షలు ఎలాంటి ఫలితాన్నీ ఇవ్వలేదు. ప్రారంభంలో రాస్తారోకో వంటి కార్యక్రమాలు చేపట్టి దడబడలు చేసినా ఆ తర్వాత నీరస పడిపోయారు. ఆగస్టు 15 తేదీ నుండి ఆమరణ నిరాహార దీక్షలు చేపడ్తామని ప్రకటించినా అది కార్యరూపం దాల్చలేదు. పైపెచ్చు ఈ ఆందోళన కావలి పట్టణ పొలిమేరలు దాటిన దాఖలాలు లేవు. కనీసం జిల్లా కేంద్రం లోని దళిత సంఘాలు కూడా స్పందించ లేదు. అధికారులైతే దీక్షలు జరుగుతున్నట్లే భావించడంలేదు. నిర్వాహకులు మాత్రం ఉప ముఖ్యమంత్రి పైనా, ఆయన వద్ద పర్సనల్ సెక్రటరీగా చేరిన మాజీ ఆర్డీవో జి.ఎన్.కె. గాంధీ పైన గట్టి నమ్మకం పెట్టుకొని వున్నారు.

## స్వర్ణా వేమయ్య మహిళా ట్రస్ట్

మహిళా సంక్షేమానికి మాజీ శాసన సభ్యుడు స్వర్ణ వేమయ్య లక్ష రూపాయల మొత్తంతో ఒక ట్రస్ట్ ఏర్పాటు చేస్తున్నారు. పల్లిపాడు హైస్కూల్ ఆడిటోరియంలో 12 తేదీ జరిగిన సభలో ఈ విషయాన్ని ఆయన వెల్లడించారు. సమాజంలో పురుషులు, స్త్రీలు సమానమని; కాని స్త్రీలు తమకు రాజ్యాంగ పరంగా సంక్రమించవలసిన హక్కులు, ఇతర సౌకర్యాలు పొందడంలేదని ఆవేదన చెందారాయన. కార్యక్రమంలో ఉపాధ్యాయ శిక్షణా సంస్థ ప్రిన్సిపాల్ పి. శ్రీరాములు, సిపిఐ పార్టీకి చెందిన పి. వేదాచలం తదితరులు పాల్గొన్నారు. బాలికల్లో జిల్లాలో పది, ఏడవ తరగతుల్లో అత్యధిక మార్కులు పొందిన నలుగురికి ట్రస్ట్ నుండి కొంత మొత్తాన్ని జిల్లా పౌర సంబంధ శాఖాధికారి పి. వేణుగోపాల్ చేత అందించారు.

## "నేను వెంకటగిరివాసినే!"

వెంకటగిరి నియోజక వర్గంలో ప్రజల కనీసావసరాలైన మంచి నీరు, రోడ్డు రవాణా, విద్య, వైద్యం వంటి సౌకర్యాలను తన హయాంలో పూర్తిగా కల్పించినట్లు మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి ధైర్యంగా చెప్పుకొన్నారు. వెంకటగిరిలో కాశీపేట నుంచి ఆఫీసర్స్ క్లబ్ వరకు నిర్మిస్తున్న సిమెంట్ రోడ్డు నిర్మాణానికి శనివారం శంకుస్థాపన చేసిన అనంతరం ఏర్పాటైన సభలో మాట్లాడుతూ ఈ సంగతి చెప్పారు. విద్యా వైద్య సాంస్కృతిక రంగాలలో జిల్లాలో చిరకాలంగా వెంకటగిరికి ఎంతో పేరు ప్రఖ్యాతు లున్నాయి. వాటిని మరింత ఇనుమడింప జేయుటకు కృషి చేస్తూ, దానిలో భాగంగా ఎడ్యుకేషన్ కాంప్లెక్స్ ఏర్పాటు చేసి అనేక విద్యాలయాలు నిర్మిస్తున్నట్లు చెప్పారాయన. తాను ఎమ్మెల్యేగా ఎన్నికయినప్పుడు వెంకటగిరిలోని కళాశాల్లో ఇంటర్, డిగ్రీలలో పాసయ్యేవారి సంఖ్య 14 శాతంగా వుండేదని; అటు వంటివి సౌకర్యాలు కల్పించిన తర్వాత 50శాతానికి పెరిగిందని చెప్పారు. తాను వెంకటగిరిలో నిర్మించిన నూతన

కొరప: 8 ... పేజీలో

రొయ్యలను రైతులు నిర్లక్ష్యంగా ఏటిలో...

### అగ్ని బాధితులకు ఆర్థిక సహాయం

మర్రిపాడు మండలం మంట పెద్దపాడు గ్రామంలోని అగ్ని బాధితులను బిసి కార్పొరేషన్ ఆదుకొంది. 25 కుటుంబాలకు పునరావాస సహాయమై గొర్రెల యూనిట్ల కొనుగోలు నిమిత్తం లక్ష 61 వేల 450 రూపాయలు మంజూరు చేసింది.

## గొలగమూడి ఉత్సవాలు

గొలగమూడి వెంకయ్య స్వామి 12 వ ఆరాధనోత్సవాలు ఆగస్టు 23, 24 తేదీలలో జరుగ నున్నాయి. ఉత్సవాల ఏర్పాట్లు పర్యవేక్షించ డానికి డి.ఓ. వి.ఎస్. విష్ణును ప్రత్యేక అధికారిగా నియమించారు. ఉత్సవానికి వచ్చే భక్తుల కోసం 60 స్పెషల్ బస్సులను ఆర్టీసీ ఏర్పాటు చేస్తోంది. 10 మంచి నీటి ట్యాంకర్లతోపాటు, పారిశుద్ధ్యం, ఆరోగ్యం నిరంతరం పర్యవేక్షించేందుకు ప్రత్యేక డాక్టర్ల బృందాలను పెడుతున్నారు. బందోబస్తు నిర్వహణను నెల్లూరు రూరల్ సిఐ చూస్తారని ప్రత్యేకాధికారి చెప్పారు.

# నెల్లూరు ముచ్చట్లు

విశ్లేషకుడు

## జనార్ధన రెడ్డి

మాజీ ముఖ్యమంత్రి, రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి వారం రోజుల వెంకటగిరి పర్యటన తర్వాత 16 తేది ఉదయం హైదరాబాదు వెళ్లారు. నెలాఖరులో మళ్లీ నెల్లూరు వచ్చే కార్యక్రమం వున్నట్లుంది.

## పసల, చదలవాడ వీధుల కెక్కారు

నాయుడు పేట మాజీ మండలాధ్యక్షుడు శ్రీ చదలవాడ కృష్ణమూర్తి ఇళ్ల మంత్రి శ్రీ పసల పెంచలయ్య పైన అవినీతి ఆరోపణలతో వీధుల కెక్కారు. వీరిద్దరి మధ్యా ఎప్పుడూ సయోధ్య లేదు. నాయుడు పేట రాజకీయాలలో జుట్లు జుట్లు పట్టుకోవడం మామూలే. కానీ ఎన్నికల మూడు నెలల్లో పెట్టుకొని వీరిట్లా బజారు కెక్కడమే అసహ్యంగా వుంది. అది ఇద్దరికీ మంచిది కాదు. అర్థం లేని ఆరోపణలు, ఆచరణ సాధ్యం కాని ప్రమాణాలతో పత్రికల కెక్కినంత మాత్రాన ఎవరికేమి జరుగుతుంది? ఇద్దరూ యోగ్యులైన కాంగ్రెస్ వాదులు; సంకుచిత తత్వంతో కాకుండా, ఎన్నికల్లో పార్టీ ప్రయోజనాలు గమనించి ఉదారంగా ప్రవర్తించ గలిగితే ప్రజలు సంతోషిస్తారు. లేకుంటే ఛీ కొడ్తారు.

## రాపూరు నాయకుల దేశం వలస

మూడు వారాలుగా చర్చల్లో వుండిన రాపూరు మాగుంట అనుచర వర్గం తెలుగు దేశం ప్రవేశం జరిగి పోయింది. పెంచలుకోన ట్రస్టు బోర్డు అధ్యక్షుడు శ్రీ పాపకన్ను జయ చంద్రశేఖర రెడ్డి, రాపూరు, చేజర్ల మాజీ మండలాధ్యక్షులు శ్రీ పాపకన్ను రాజశేఖర రెడ్డి, శ్రీ కొమ్మి లక్ష్మయ్య నాయుడు తెలుగు దేశం పార్టీలో అధికారికంగా చేరిపోయారు. జిల్లా నాయకులు మొదట ఈ చేర్పుకు తట పటాయించినా డాక్టర్ దగ్గుపాటి వెంకటేశ్వర రావు పత్రిరి వల్ల చివరకు ఒప్పుకోక తప్పలేదు. జిల్లా అధ్యక్షుడు శ్రీ సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి వారి నుంచి సభ్యత్వ పత్రాలు తీసుకున్నారు.

లక్ష్మయ్య నాయుడు గమ్మున చేరి పోయారు కాని, జయ చంద్రశేఖర రెడ్డి తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టే తరహాలో మాగుంట సుబ్బరామ రెడ్డి గారిని ఎగతాళిగా వ్యాఖ్యానించి మరీ ఫిరాయించాడు. మాగుంట ధర్మాన వచ్చిన ట్రస్టు బోర్డు ఛైర్మెన్ పదవి మాత్రం వదలి పెట్ట లేదు.

రాజశేఖర రెడ్డి, జయచంద్రా రెడ్డిలకు వ్యక్తిగతంగా రాపూరులో మనిషి లేదు. స్వర్గీయ నువ్వుల వెంకట రత్నం నాయుడు అనుచరులనే పంచు కోవాలి. మాగుంట సుబ్బరామ రెడ్డి ఈ విషయంలో చాలా పట్టుదలగా వున్నట్లున్నాడు. నాయుడు గారి మనిషన్న ప్రతి వాడినీ బ్రతిమ లాడి దగ్గర చేర్చు కుంటున్నారు. రేపు 25 తేది పొదలకూరులో సభ వుంది. ఆ రోజు తేలి పోతుంది, ఎవరెవరు ఎవరి వైపో?

## యానాది రెడ్డి ఒకె

బైపాస్ ఆపరేషన్ చేయించు కొన్న దేముళ్ళ మంత్రి శ్రీ కలికి యానాదిరెడ్డి కులాసాగా వున్నారు. తిరుమల దేముడి సన్నిధిలో విశ్రాంతి తీసుకుంటున్నారు. ఎన్నికలలోగా ఆయన పూర్వపు చలాకి తనంతో తిరిగి రావాలని ఆకాంక్షిస్తున్నాము.

## రాజీవ్ జయంతి- వారం కార్యక్రమాలు

రాజీవ్ జయంతి సందర్భంగా 20 తేది నుంచి వారం రోజుల పాటు జిల్లా వ్యాప్తంగా సభలు జరపాలని డిసిసి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి తల పెట్టారు. మొదటి సభ 20 తేది సాయంత్రం 5 గంటలకు ఇందిరా భవన్‌లో జరుగుతుంది. తర్వాత అన్ని కీలక పట్టణాలు, గ్రామాలలో జరుగుతాయి. ఆ సభలలోనే కాంగ్రెస్ పార్టీ సభ్యత్వ నమోదు కార్యక్రమం కూడా నిర్వహించ బడుతుంది. సంజీవ రెడ్డి గారే నాయకుడు.

## జెకె రెడ్డికి కాంగ్రెస్ తీర్థం



కాంగ్రెస్ పార్టీలో తన ప్రాథమిక సభ్యత్వాన్ని పునరుద్ధరించు కుంటున్న నేదురుమల్లి జనార్ధనరెడ్డి; ప్రక్కన డిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవరెడ్డి, ఎమ్మెల్యే డాక్టర్ బి. సుదంరరామరెడ్డి, యువనాయకులు దీపకుమార్ రెడ్డి, సునీల్ కుమార్‌రెడ్డి.

రెడ్డిని కాంగ్రెస్‌లో తిరిగి చేర్చు కుంటున్నట్లు ప్రకటించారు కేంద్ర నాయకుడు శ్రీ జనార్ధన పూజారి. ఐదేళ్ల క్రితం శాసన సభ ఎన్నికల సమయంలో తిరుగుబాటు అభ్యర్థిగా పోటీ చేసినందుకు శిక్షగా పార్టీ నుంచి సస్పెండ్ చేశారు. ఆ సస్పెన్షన్ ఉత్తర్వును ఇప్పుడు రద్దు చేసినట్లు ప్రకటించారు.

జెకె పేరుకు స్వతంత్రుడే కాని, కాంగ్రెస్ వారి క్రిందే లెక్క. ఎప్పుడూ ఆ తేడా తెలియ లేదు. అందువల్లే ఆయన కాంగ్రెస్ చేరిక పెద్ద వార్తగా



నెల్లూరులో పేరున్న పంటి డాక్టరు. జి. కొండారెడ్డి తనయ మమత; డాక్టర్ ప్రసాదరెడ్డి బిడిఎస్, ఎండిఎస్. వీరి వివాహం 10తేది కళాక్షేత్రంలో జరిగింది.

## సణుగుడు

( 4వ పేజీ కొరవ )

రెడ్డి తాను తెలుగు దేశంలో చేరి పోవడమే కాదు - సుబ్బరామ రెడ్డి ప్రక్కన ఇంకా మిగిలి వున్న నువ్వుల కుటుంబీకుల్ని కూడా తనతో లాక్కుని పోవడానికి దారులు వెతుకు తున్నాడు.

ఇది వరకు స్వర్గీయ నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి కూడా ఇట్నే జనార్ధన రెడ్డి మీద అయిష్టతతో ఆయన్ను రాజకీయంగా పతనం చేయడం అనే ఒకే ఒక్క సింగిల్ పాయింట్ ప్రోగ్రాం నిర్దేశించు కొని జీవితాంతం పోరాడాడు. శ్రీనివాసులు రెడ్డి త్రొక్కడానికి ప్రయత్నించిన కొద్దీ, జనార్ధన రెడ్డి పైపైకి ఎదిగి పోయాడు. శ్రీనివాసులు రెడ్డి ఆ కార్యక్రమమే చేపట్టక పోయి వుంటే అప్పట్లో జనార్ధన రెడ్డికి అంత పాపులారిటీ, రాజకీయ పోరాట పటిమ అబ్బి వుండేవే కావన్నది నిజం. శత్రు దాడిని తప్పించు కోవడానికి ఎప్పుడూ అలర్ట్‌గా వుండ వలసి రావడమే ఆయనకు తర్వాత తర్వాత అదృష్టంగా పరిణ మించింది.

ఇప్పుడు ఆనం వారి విషయంలోనూ అదే జరుగుతూంది.

1978 లోనే ఆనం కుటుంబం రాజకీయ క్షీణ దశ చవి చూచింది. ఆనాటి నుంచి వారు వెనుక బడిన వారి క్రిందే వుండి పోయారు. జిల్లా మొత్తాన్ని శాసించే స్థితి నుంచి, ఒక్క సీటుకు అర్హులుగా క్రిందదిగకు పరిమితమై పోయారు. వ్యక్తిగతంగా కుటుంబ సభ్యులకు గుర్తింపు తప్ప, ఒక రాజకీయ కుటుంబంగా గౌరవం కోల్పోయింది. ఆనం సంజీవ రెడ్డి వయస్సు పెద్దరికమే తప్ప, రాజకీయ కుటుంబానికి ప్రాతినిధ్యం వహించే స్థోమత కోల్పోయారు. ఆయన ఆలోచనలు, ఎత్తుగడలు, నిర్ణయాలు తన స్వంతానికే లోబడి వుంటాయి. అక్కడా ఇక్కడా తిరిగి చివరకు జనార్ధన రెడ్డి గారి స్నేహితంలో కుదురు కొని సంతృప్తిపడి పోతున్నాడు. అంతకు మించి ఆయనకు ఆశలున్నాయో లేదో నాకైతే తెలియదు కాని, అవకాశాలు మాత్రం లేవు.

ఆనం వెంకట రెడ్డి గారికి పెద్దరికం వచ్చేసింది. రిటైరై పోయారు. ఎందులోనూ జోక్యం లేదు. ఆనం భక్తవత్సలు రెడ్డి గారి నిర్ణయమూ అదే. మనుమలు, మనుమరాళ్లతో కాలక్షేపం చేస్తున్నారు. ఆయనకూ ఆరోగ్యం చెడింది.

ఇక మిగిలింది వివేక, రామనారాయణ రెడ్డి. వారిద్దరూ యువకులు కావడంతో అప్పుడు తెలుగు దేశంలోనూ, ఇప్పుడు కాంగ్రెస్‌లోనూ పెద్ద నాయకు లెవరూ వారిని సీరియస్‌గా తీసుకోలేదు. సంజీవ రెడ్డి ఇంటి పేరు కూడా ఆనం కావడం వీరికి తరచూ ఇబ్బంది కల్గించే విషయం. అందులోనూ వివేకా ఒక్కడే వీధిలో తిరిగేది; రామ నారాయణ ఎక్కడుంటాడో, ఏమి చేస్తుంటాడో ఎవరికీ తెలియదు. కొద్దిగా నెల్లూరు టౌన్, పూర్తిగా రాపూరులో తప్ప వీరు తమ వర్గాన్ని పరి రక్షించుకొనే లేదా పెంచుకొనే ప్రయత్నం [illegible] లేదు. కావలి, ఉదయగిరి, ఆత్మకూరు వంటి నియోజక వర్గాలతో వారికి కొత్తగా పరిచయం పోయింది. సర్వేపల్లితోనూ అంత సంబంధాలు లేవు.

రాజకీయంగా నామ మాత్రావశిష్టమై పోయిన ఆనం వర్గాన్ని భూతద్దంలో చూసి, పెద్దదిగా వూహించు కొని గాలిలో కత్తి ఝుళి పిస్తున్నాడు మాగుంట సుబ్బరామ రెడ్డి. ఆయన పుణ్యమా అని ప్రతి దినం వారి పేరు ప్రచారంలోకి వస్తున్నది. ముఖ్యమంత్రి కూడా మర్చిపోయిన ఏసి కాలం నాటి పాత సంబంధాలను నెమరు వేసుకొని వీరిద్దరినీ ప్రక్కన కూర్చో బెట్టుకుంటున్నారు. రాజకీయ చర్చలు, సంభాషణలలో తిరిగి వారికి ఒక వర్గంగా గుర్తింపు లభిస్తున్నది. సుబ్బరామ రెడ్డి వ్యతిరేకు లందరూ వెనుక నుంచి సైగ్గా సహాయ మివ్వడానికి రెడీగా వున్నారు. రాపూరులో ఇది ఆనం వర్గం అని లక్ష్మణ రేఖ గీసి, సమీకృతం చేస్తున్నారు సుబ్బరామ రెడ్డి గారు. ఆలోచన లేకుండా ఇదంతా చేస్తున్నాడో, లేక అమాయ కత్వంతో వ్యవహ రిస్తున్నాడో తెలియదు కాని - ఆనం వర్గానికి పునరు జ్జీవితం కల్పిస్తున్నా డాయన. అందుకు సోదరు లిద్దరూ సుబ్బరామ రెడ్డి గారికి రుణ పడి వుండాలి.

* * *

అమెరికాలో మూడు వారాలు చక్కర్లు కొట్టి తిరిగి వచ్చాను. నెల్లూరును, పత్రికను వదలి ఇంత కాలం దూరంగా వుండడం ఇదే ప్రథమం. ఇటు పసిఫిక్, అటు అట్లాంటిక్ తీరాలు రెండింటినీ తాకి, పలు నగరాలు చూశాను. కొన్ని వేల కిలో మీటర్లు తిరిగాను. ఎంత తిరిగినా, ఎంత చూసినా అమెరికా జన జీవితంలో నన్నాకర్షించిన అంశమేదీ లేదు. రోడ్లు బాగున్నాయి, ఇళ్లు బాగున్నాయి, వసతులు బాగున్నాయి, కార్లు బాగున్నాయి, పరిశ్రమలు బాగున్నాయి, సంపాదన బాగుంది. ఇటువంటి భౌతికావ సరాలు ఏది చూసినా వేలెత్తి చూపాల్సిన అవసరమే రాదు. కాని ఎన్ని సౌకర్యాలున్నా ఏదో అసౌకర్యం వుంది; ఎంత తృప్తిగా కన్పించినా తెలియని అసంతృప్తులు లోలోన కొట్టు మిట్టాడు తున్నాయి. జీవితం యాంత్రికంగా, గానుగెద్దు చందంగా వుంది. ఒకటే పరుగు; పరుగో పరుగు. నిల్చి, నిదానంగా నడిచే సావకాశం ఎవరికీ లేదు. ఒక్క క్షణం విరామం లేదు. ఆ దేశ జన జీవితాన్ని సున్నితంగా, సునిశితంగా పరిశీలించిన తర్వాత నాకు అమెరికా ఒక మేడి పండు వలె కన్పించింది.

పైపై తళుకులు, మెరుగులు తప్ప నిజమైన జీవన సౌఖ్యం లేదక్కడ. అదొక డబ్బు ప్రపంచం, డబ్బే సర్వం. డబ్బుతో ఏ సుఖాన్నయినా కొనుక్కోవచ్చు. కానీ డబ్బుతో కొనలేని మనశ్శాంతి మాత్రం అక్కడ ఎల్లెడలా కరువే.

అమెరికా గురించి





## నెల్లూరు ముచ్చట్లు

9 పేజీ కొరవ

పరిగణింపబడడం లేదు.

### వెంకటస్వామికి ఎస్‌వియు సభ్యత్వం

మాజీ పబ్లిక్ సర్వీస్ కమీషన్ సభ్యుడు శ్రీ వెంకట స్వామిని శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం మేనేజి మెంటు కౌన్సిల్ సభ్యుడుగా నియ మించింది ప్రభుత్వం. వెంకట స్వామి నెల్లూరీయుడు. రాష్ట్ర మునిసిపల్ డైరక్టర్‌గా కూడా పని చేశారు. నెల్లూరు విఆర్ కాలేజీకి ప్రిన్సిపల్‌గా, బోర్డ్ ఆఫ్ ఇంటర్మీడియట్ కార్యదర్శిగా కూడా వుండినారు. విద్యావంతుడు, సౌమ్యుడు, ఆయన సేవలు యూనివర్శిటీ నిర్వహణకు వుపక రించ గలవని ఆశిద్దాం!

### రాయపాటి

20సూత్రాల పథకం అమలు కమిటీ ఛైర్మన్ శ్రీ రాయపాటి సాంబశివరావు 18తేది నెల్లూరు వచ్చారు. సాయంత్రం వరకు వుండి తిరుమల వెళ్లారు.

### మరణాలు

మద్రాసు నుంచి వెలువడే ప్రసిద్ధ ఆంగ్ల పత్రిక ఎక్స్‌ప్రెస్‌కు కొంతకాలం ఎడిటర్‌గా పని చేసిన అభ్యుదయ మహిళ శ్రీమతి సీతాఎరాలి తండ్రి, ఆత్మకూరు సమితి మాజీ అధ్యక్షుడు శ్రీ పండ్లూరు వెంకట సుబ్బారెడ్డి 11తేది మరణించారు. ఆయన వయస్సు 80 సంవత్సరాలు. ఒక కుమారుడు, ఆరుగురు కుమార్తెలు వున్నారు.

* * *

నర్తకిపోలు నిర్మాత, సందడి సవ్వడి లేకుండా తన పనేదో తాను చేసుకపోయే వివాదరహితుడు, కాంట్రాక్టరు శ్రీ గుండ్రా జనార్ధనరెడ్డి తల్లి శ్రీమతి రాజమ్మ మరణించారు. పరమ దైవ భక్తురాలు, జొన్నవాడ కామాక్షితాయి దేవస్థానానికి ఎంత విరాళ మిచ్చిందో చెప్పలేము. ప్రతిరోజు పదిమంది పేదలకు అన్నం పెట్టి, సంతృప్తి పడేదామె.

* * *

అభ్యుదయ రైతు, చేపల రొయ్యల పెంపకంలో కూడా ఆందరి ప్రయోగాలు చేసి విజయం సాధించిన సౌమ్యుడు, మృదుభాషి మంచి స్నేహితుడు శ్రీ సామంతు గోపాలరెడ్డి తండ్రి సామంతు చిన వెంకురెడ్డి నెల్లూరులో 15తేది మరణించారు. ఆయన వయస్సు 89 సంవత్సరాలు. సింధూర నర్సింగ్‌హోం యజమాని, హృద్రోగ చికిత్సలో తిరుగులేని వైద్యుడు డాక్టర్ జి. రామచంద్రారెడ్డి ఆయనకు మేనల్లుడు.

పై కుటుంబాల వారికి మా సానుభూతి తెలుపుతున్నాము.

### వధువు కావలెను

బ్రాహ్మణ ఆఫీసర్ ఉద్యోగికి 40 - 48 సం.ల మధ్య వయస్కురాలు ఉద్యోగిని లేక ధనిక కుటుంబమునకు చెందిన, ఏ కులము వారయినా ఏతంతువులైన వధువు ఫోటోతో వ్రాయండి.

Box. No. 508
C/o. జమీన్‌రైతు,
నెల్లూరు. - 524 004

## జనవాణి

( 3 వ పేజీ కొనసా )

ప్రశాంతత కోసం ప్రతి క్షణం పాటు పడుతూనే వున్నాం.

నెల్లూరు - పి. రమేష్ బాబు

### గూడూరు సబ్ జడ్జి కోర్టులో

O.P. 73/93

గుంట్రకింద ప్రభాకరరెడ్డి -పిటీషనరు

Vs

(1) గుంట్రకింద పార్వతి

(2) గుంట్రకింద మధుసూదన రెడ్డి -రెస్పాండెంట్లు

To

1. గుంట్రకింద పార్వతి W/o. ప్రభాకరరెడ్డి

2. గుంట్రకింద మధుసూదనరెడ్డి S/o. చిన్నరమణారెడ్డి, W3/469, లక్ష్మీపురము, స్టోన్‌హౌస్‌పేట, నెల్లూరు.

పిటీషనరు 1వ రెస్పాండెంటు నుండి విడాకులు కోరుతూ పై కోర్టులో పిటీషను దాఖలు చేసినారు. పై పిటీషను మీరు హాజరు అగుటకు గాను 13.9.94 తేది వాయిదా వేయబడి వున్నది. ఆ దినము ఉదయం 10.30 గంటలకు మీరు పై కోర్టులో నేరులో గాని, వకీలు ద్వారా గాని హాజరు కావలయును. అట్లు హాజరు కాని యెడల పై పిటీషను మీ పరోక్షములో తీర్మానము చేయబడునని తెలియ చేయడమైనది.

బి. రామదాసు
బి. మురళీకృష్ణ
వెంకటగిరి పిటీషనరు అడ్వకేట్స్

### నెల్లూరు కో ఆపరేటివ్ అర్బన్ బ్యాంకు, నెల్లూరు.

నం. 2319, ఫోన్: 26536

### ప్రకటన

ఇందుమూలముగా తెలియ జేయడ మేమనగా నెల్లూరు టవున్ వాకర్స్ రోడ్డు, మూలాపేట కాపురస్తురాలు పూనమల్లి సుబ్బమ్మ, W/o. లక్ష్మయ్య ఈ బ్యాంకు నందు ఆయనకవు అప్పు కోరుచూ వారి పేరిటనున్న 29.8.72 తేది విక్రయ పత్రము రిజిష్టరు డాక్యుమెంటు నం. 2230 / 1972 పబ్లిక్ కాపి దాఖలు పరచి, ఒరిజినల్ పత్రములు పోగొట్టు కొనినట్లు తెల్పియున్నారు. ఇందుకు సంబంధించి చూపుడు అడుమానములు గాని, ప్రామిసరీ నోటు బాకీలు గాని, ఇతర ఏ విధమైన హక్కులు, అభ్యంతరములు వున్న ఎడల బ్యాంకు వారికి ఈ ప్రకటన తేది నుండి పది రోజుల లోపల వ్రాతమూలకముగా తెలియ జేయ కోరడమైనది.

### ఆస్థి షెడ్యూలు

నె.రి.డి. జిల్లా నెల్లూరు టవున్ వాకర్స్ రోడ్డు మూలాపేట ము. వార్డునం 20కు, డోరు నం. 1894 కు అసెస్‌మెంట్ నం. 28693 కు గల మిద్దె యిల్లు, పై మిద్దె వగైరాలకు హద్దులు. తూర్పు వాకర్స్ రోడ్డు దక్షిణం: ములమూడి రోడ్డు నుండి మున్సిపల్ కొళాయికి కాలువకు పోవుదారి. పడమర: పారుదల కాలువ. ఉత్తరం: కరకంబాకం ఆదెమ్మ వగైరాల యిల్లు స్థలము.

యీ హద్దులలోని 7 అంకణముల స్థలము. యిందులోని మిద్దె యిల్లు, పై మిద్దె యిల్లు 7 అంకణములు.

A.P.R. రాజా J.C.S. అమర్‌నాథ్
కార్యదర్శి అధ్యక్షుడు

### ప్రధానికి అభినందనలు

స్వాతంత్ర్య దినోత్సవం నాడు ఎర్ర కోట మీద నుంచి ప్రధాని చేసిన ప్రసంగం చరిత్రాత్మక మైంది. కాశ్మీర్ విషయంలో ఏ ప్రధాని కూడా ఇంత గట్టిగా ఇప్పటి వరకు చెప్పనే లేదు. త్వరగా కాశ్మీర్ ఆక్రమిత ప్రాంతాలను మన దేశంలోకి కలుపుకొని సరిహద్దును గట్టిగా మూసివేస్తే మన దేశంలో అల్లర్లు, మెమన్ బ్రదర్స్ వంటి దుర్మార్గుల ఆటలు అరికట్ట బడతాయి. ఈ చర్య వల్ల మన త్రివర్ణ పతాకం ప్రపంచ చరిత్రలో దివ్యమైన తేజస్సుతో వెలుగొందడమే కాకుండా, అత్యంత శక్తివంతమైన దేశంగా మన దేశం వర్ధిల్లుతుంది.

-గునుపాటి వేణుగోపాల్

నెల్లూరు.

### టర్నోవర్ టాక్స్ రద్దైనా ధరలు తగ్గలేదు

రాష్ట్ర ప్రభుత్వం టర్నోవర్ టాక్స్‌ను రద్దు చేసి చాలా రోజు లయ్యింది. విచిత్ర మేమిటంటె టాక్స్ లేని దాని వల్ల నిత్యావసర వస్తువుల ధరలు తగ్గాల్సింది పోయి పెరుగు తున్నాయి. కాఫీ, టీ, నూనె ధరలు నింగి నంటుతున్నాయి. ధరల నియంత్రణలో ప్రభుత్వం విఫల మయ్యింది. టాక్స్ ఎత్తేశాం కాబట్టి ధరలు తగ్గుతాయని ప్రభుత్వం మాట వరుసకు పేర్కొం టున్నది కానీ, ప్రజల బాధల గూర్చి పట్టించు కోవడం లేదు.

నెల్లూరు -కె. రుక్మిణి

### బస్టాండులో మరుగుదొడ్డి నిర్మించండి.

గూడూరు టౌన్‌కు చుట్టు ప్రక్కల అనేక మండలాల నుండి ప్రజలు నిత్యం గూడూరుకు వస్తుంటారు. కానీ మానవ సహజావసరమైన కాలకృత్యాల అవసరాలకు టౌన్‌లో ఒక్క మరుగు దొడ్డి గానీ, మూత్ర శాల గానీ లేదు. ఈ విషయంలో టౌన్ కొచ్చే ప్రజల బాధ వర్ణనా తీతం. ముఖ్యంగా స్త్రీల పరిస్థితి పరమ దయనీయంగా వుంది. ప్రభుత్వం గానీ, మునిసిపాలిటీ గానీ ఈ విషయాన్ని బొత్తిగా పట్టించు కోవడం లేదు. పాత బస్టాండులో వున్న మరుగుదొడ్డిని పడగొట్టి ఆ సౌకర్యం కూడా లేకుండా పుణ్య- కట్టుకొన్నారు. సంబంధిత అధికారులు శ్రద్ధ వహించి 'మూల్యంతో వుప యోగించుకొనే' ఏర్పాటుతో సులభ కాంప్లెక్స్‌ను టౌన్ మధ్య నెలకొల్పితే బాగుంటుంది. ఎన్నో సేవా కార్యాలను చేస్తున్న స్వచ్ఛంద సంస్థలైన లైన్స్, రోటరీ క్లబ్బులు ఈ విషయంపై చొరవ తీసుకుంటే బాగుంటుంది.

చెన్నూరు -పానుగంటి శ్రీరాములు

## జిల్లావార్తలు

5 వ పేజీ కొనసా

వివరించారాయన. వెంకటగిరిలో జరిగిన అభివృద్ధి కార్యక్రమాలకు గుర్తుగా క్రాస్ రోడ్డు వద్ద ప్రగతి స్థూపం ఏర్పాటు చేయనున్నట్లు చెప్పారు. ఈ కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ ఎం. సాంబశివ రావు, చెలికం శంకర రెడ్డి, శ్రీమతి రాజ్యలక్ష్మి పాల్గొన్నారు.

### కావలి కాళిదాసుపోటీల్లో విజేతలు

ఆవిర్భావం నుండి ప్రతి సంవత్సరం జాతీయ స్థాయిలో నాటికల పోటీలు నిర్వహిస్తున్న కావలి కాళిదాసు కళారాధన సమితి 31వ సంవత్సరపు నాటికల పోటీలను విజయ వంతంగా నిర్వహించింది. కారొనేషన్ రీడింగ్ రూం ఆవరణలో 13 తేది నుండి 15 తేది వరకు ఈ పోటీలు జరిగాయి. సినీ, స్టేజీ ఆర్టిస్ట్, నంది అవార్డు గ్రహీత శ్రీమతి లక్ష్మీప్రియ నట రాజ పూజతో పోటీలను ప్రారంభించారు. సినీ దర్శకుడు యు.వి. బాలాజీ బాబు, సినీ ఆర్టిస్ట్ విజయ శేఖర రెడ్డి, రోజా హిందీ సినిమా డిస్ట్రిబ్యూటర్ సికాకొల్లు వెంకటేశ్వర్లు అతిథులుగా పాల్గొన్నారు. నాటికల పోటీల్లో ఉత్తమ ప్రదర్శనగా జాలాది మానవతా కళా మందిర్ వారి 'రివర్స్ మార్చ్' ఎంపికై 3 వేల రూపాయల నగదు బహుమతిని గెల్చు కొన్నది. ఓలేటి పాశం ' ది రూట్' ద్వితీయ ప్రదర్శనగా పుణ్యభూమి ఉత్తమ తృతీయ ప్రదర్శనగా ఎంపి కయ్యాయి. ఉత్తమ నటునిగా 'ది రివర్స్ మార్చ్' లో ప్రిన్సిపాల్ పాత్రధారి జరుగుల రామారావు. ఉత్తమ నటిగా 'లేడి పంజా' లో వెంకట సుబ్బలక్ష్మి పాత్రధారి శ్రీమతి రత్నకుమారి, ఉత్తమ విలన్‌గా ది రూట్‌లో నాగరాజా పాత్రధారి జి. నాగేశ్వర రావు. ఉత్తమ హాస్య నటునిగా ది రూట్‌లో పోలీస్ ట్రైనింగ్ ఆఫీసర్ శ్రీ వి.బి.కె. శర్మ, ఉత్తమ దర్శకునిగా మేడిపండు దర్శకుడు కె. శాంతి బాబు, రచయితగా లేడి పంజా రచయిత ఎం.వి.ఎస్. హరనాథ రావులను ఎంపిక చేశారు. విజేతలకు దర్శకుడు యు.వి. బాలాజీ బాబు మెమెంటోలు బహూకరించారు. కార్యక్రమంలో కాళిదాసు కళారాధన సమితికి చెందిన ఎల్.వి. కృష్ణారెడ్డి, ఎం. కృష్ణారెడ్డి, పి. వీరా రెడ్డి, ఎస్. కృష్ణమూర్తి, కారొనేషన్ రీడింగ్ రూం అధ్యక్షులు డాక్టర్ వెంకా రెడ్డి పాల్గొన్నారు.

### కలిగిరిలో స్వాతంత్ర్య దినోత్సవం

కలిగిరి మాగుంట సుబ్బరామ రెడ్డి కళాశాలలో స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు ఘనంగా జరిగాయి. సాహితీ వేత్త డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేసి మాట్లాడారు. స్వాతంత్ర్య దినోత్సవం కుల, మత, విచక్షణ లేకుండా అందరూ జరుపుకొనే పండుగ. మేమంతా 20 వ శతాబ్దానికి చెందిన వారము; స్వాతంత్ర్యాన్ని సంపాదించే అవకాశం మాకు లభించింది. స్వాతంత్ర్యమనే కాగడా వెలుగులో విద్యార్థినీ విద్యార్థు లందరూ భారత దేశ పురోభి వృద్ధికి పాటు [illegible]

రామచంద్రా రెడ్డి డాక్టర్ గోపాల రెడ్డి గారిని సన్మానించారు. కార్యక్రమంలో జవహర్ భారతి కరస్పాండెంట్ దీపాల రాధాకృష్ణ మూర్తి, రిటైర్డ్ ప్రొఫెసర్ జలపాపులూరి కామేశ్వరరావు, కాంగ్రెస్ నాయకుడు ఎల్.వి. కృష్ణారెడ్డి, కళాశాల ప్రిన్సిపాల్ కె.వి. సుబ్బు రాయుడు పాల్గొన్నారు. ఎకనామిక్స్ లెక్చరర్ డాక్టర్ బాలాజీ రెడ్డి ప్రార్థనా గీతంతో ప్రారంభమైన సభ హిస్టరీ లెక్చరర్ ఉమా మహేశ్వర రావు వందన సమర్పణతో ముగిసింది.

### పోలీసుల పై నేదురుమల్లి ప్రశంసల జల్లు!

మాజీ ముఖ్య మంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి జిల్లా పోలీసుల పని తీరు పై ప్రశంసల జల్లు కురిపించారు. 12 తేది ఓజిలి గ్రామంలో నూతనంగా నిర్మించిన పోలీస్ స్టేషన్ భవనాన్ని ప్రారంభించి మాట్లాడారు. ప్రజలకు ప్రత్యక్షంగా సేవ చేసే శాఖలు ఏవైనా వుంటే అందులో పోలీస్ శాఖ మొదటి దంటూ; పోలీస్ శాఖలో అనేక మంది విద్యాధి కులున్నారని వీరి ఆలోచనా విధానంలో గొప్ప మార్పులు చోటు చేసు కొన్నందున ప్రజలకు చేరువవు తున్నట్లు చెప్పారు. నక్సలైట్ల ఆలోచన విధానంలో మార్పులు తీసుకు వచ్చేందుకువారికి అనేక సౌకర్యాలు కల్పించినట్లు చెప్పారు. ఇప్పటికి 15 వేల మంది నక్సలైట్లకు ప్రభుత్వం పునరా వాసం కల్పించి నట్లు వివరించారు. కరీంనగర్ జిల్లాలోని ఆర్టీసీ డిపో రాష్ట్రంలో అతి తక్కువ ఆదాయంగల డిపోగా వుండేదని, ఈనాడు ఆదాయంలో అది ప్రథమ స్థానంలో వుందని తెలిపారు. జిల్లా పోలీస్ సూపరింటెండెంట్ రమణ మూర్తి మాట్లాడుతూ జిల్లాలో ఇప్పటి వరకు 61 పోలీస్ స్టేషన్లు వ్నాయని, వాటిలో 49 సొంత భవనాల్లో నడుస్తుండగా, 12 ప్రైవేట్ భవనాలలో నిర్వహిస్తున్నట్లు చెప్పారు. జిల్లాలో 2351 పోలీస్ క్వార్టర్లు నిర్మించేందుకు ప్రభుత్వం అనుమతించినట్లు తెలిపారు. కార్యక్రమంలో జిల్లా మంత్రి పసల పెంచలయ్య, శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ, చెలికం శంకర రెడ్డి, మండల కాంగ్రెస్ నాయకుడు సి.సి.ఆర్. గోపాల్ రెడ్డి పాల్గొన్నారు.

### రాపూరు నడిరోడ్డు పై ట్రాన్స్‌ఫార్మర్లు

ప్రజలతో నిత్యం రద్దీగా వుండే ప్రాంతాల్లో ఫెన్సింగ్ కూడా లేకుండా ట్రాన్స్‌ఫార్మర్లు పెట్టి ప్రజల ప్రాణాలతో విద్యుత్ సిబ్బంది ఆడు కొంటున్నారు. రాపూరులో జన వాస ప్రాంతాలైన కొత్త పేట సెంటర్, నీళ్ల ట్యాంకు, పడమట వీధి కొలిమి ప్రాంతాల్లో ట్రాన్స్‌ఫార్మర్లు పెట్టి వున్నారు. కెపాసిటీ మించి కనెక్షన్ల భారం వీటి పై పడడంతో తరచూ నిప్పురవ్వలు రేగడం, అవి కాలిపోవడం జరుగుతుంది. ఇవి నిత్యకృత్యమై పోవడం వల్ల జనం భీతిల్లి పోతున్నారు. ట్రాన్స్‌ఫార్మర్లు ఏర్పాటు చేసిన ప్రాంతాల్లో ఫెన్సింగ్ కూడా లేకపోవడంతో దానిని పిల్లె పిల్లలు, నోరు లేని పశువుల ప్రమాదం ఏమున వుంటున్నాయి. ఎలక్ట్రిక్ ఏఇ.

## శివారెడ్డి పద్యాలు

### పంటి డాక్టర్ కొండారెడ్డి

తాతయ్యినాక తల్లోస్త నరికాక
బయట రావలంటె బాధ, సిగ్గు!
లేకపోతె చేదా? నాకు కొండారెడ్డి!
పెళ్ళి విందు, పెలవు వెళ్ళి వస్తా!

### ఇండిపెండియన్సు

కన్నుదెరవకుంటెగాంధీ మహాత్ముండు
జననమందకుంటె జవ్హారులాలు
ఇండిపెండియన్సుయికలేదు,యిక రాదు
పల్లెటూరి కవికి ప్రతిది తెలుసు

సాగిపోతె దివికి సంపూర్ణ స్వాతంత్ర్య
దిన మహోత్సవాన్ని కనులజాచి
పరినమాప్తి యిక పద్యాలు, గద్యాలు
రెస్టు పాఠకులకు వేస్టు టైము

వృద్ధ కవిని నీవు ప్రొద్దస్తమానమ్ము
పైకి పోతనంటావ్ పనిల బాట్ల
ఇక్కడుండి చేసేదేముంది; స్వర్గంలో
రంభ వుంది నన్ను రమ్మనంది

ఈగలొక్కప్రక్క, గండుచీమలొకప్రక్క
దోమలొకప్రక్క దుంపదెంప
పగులురెయ్యినన్ను పట్టి బాధిస్తున్నాయి
బడుగు కవికి యిదో బంధిఖాన

## పంచాంగం

21 తేది ఆదివారం శ్రావణ పూర్ణిమ

ముహూర్తములు

20 తేది శనివారం ఉదయం 8.32 గంటలకు కన్యాలగ్నమున గృహారంభ, వ్యాపార, వివాహములకు

24 తేది బుధవారం ఉదయం 9.28 గంటలకు కన్యా లగ్నమున గృహారంభ, వ్యాపార, వివాహములకు సుముహూర్తము లున్నవి.

### ఆగస్టు తిథులు

శ్రావణ శుద్ధ

తే 20 శని చతుర్దశి ప.గ. 12.26 వ
తే 21 ఆది పూర్ణిమ ప.గ. 11.54 వ

శ్రావణ బహుళ

తే 22 సోమ పాడ్యమి.గ. 11.46 వ
తే 23 మంగళ విదియ.గ. 12.11 వ
తే 24 బుధ తదియ ప.గ. 1.05 వ
తే 25 గురు చతుర్థి ప.గ. 2.25 వ
తే 26 శుక్ర పంచమి ప.గ. 4.10 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకులు | |
| 9672 | 3,500/- |
| 9674 | 3,800/- |
| ఐ.ఆర్. 20 | 3,200/- |
| సున్నాలు | 3,100/- |
| మొలగొలుకు బియ్యం 70 కి | 550/- |
| బంగారు సవర 8 గ్రా | 3,520/- |

# చిరంజీవి మద్రాసు ప్లాన్ ఫ్లాప్!

నిర్మాణ వ్యయం దృష్ట్యా కాకుండా సెంటిమెంట్ దృష్ట్యా కూడా చిరంజీవి చిత్రాలు ఇటువైపు మద్రాసులో తయారవుతాయని 'జమీన్‌రైతు' వ్రాసిన విషయం మద్రాసు చిత్ర పరిశ్రమలో గొప్ప సంచలనం సృష్టించింది. ''జమీన్‌రైతు'' లో ఆ వార్త చదివిన కొందరు ప్రముఖులు ఆ సంచిక కాపీ చేతిలో పట్టుకొని చిరంజీవిని, ఆయనతో ఆగస్ట్ 26నుంచి చిత్రాన్ని ప్రారంభించవలసిన నిర్మాత కె. దేవీ వరప్రసాద్‌ను, ఆగస్ట్ 22నుంచి చిత్రాన్ని మొదలెట్టే విజయ బాపినీడు ని కలుసుకుని, మద్రాసులో వాళ్ళ చిత్రాలు నిర్మించడానికి చేసిన ప్రయత్నాలు విఫలం చేయడంలో కృతకృత్యులయ్యారు. ''జమీన్‌రైతులో నిరాధారమైన వార్తలు రావు. అందువల్ల, వీరు మద్రాసులోనే చిత్రాలు ప్లాన్ చేసింది నిజమేనా? నిజం కాకపోతే చెప్పండి, ఆ పత్రికలో ఆ వార్తను వ్రాసిన జర్నలిస్టును ఆ పత్రిక నుంచి తొలగించేలా చేస్తాను''. అని ఒక ప్రముఖుడు ఆవేశంలో అన్నాడట కూడా. జమీన్‌రైతు ఎడిటర్ అంటే తమ కంపెనీ ఉద్యోగి అనుకున్నాడేమో ఆ ప్రముఖుడు! తన ఇష్టప్రకారం ఉద్యోగం నుంచి పీకేయడానికి! పత్రికా రంగంలో సినిమా పప్పులు ఉడకవన్న సంగతి ఆయనకు తెలిసి వుండలేదు. అందుకే చిరంజీవి సన్నిహితులు ''ఆ వార్త కొత్తగా ఖండింప దగినది కాదు. అసలా విషయం ఎలా పొక్కిందో ఆశ్చర్యంగా వుంది. ఆ వార్తవ్రాసిన జర్నలిస్టును తొలగించడం వల్ల ఎవరికి ఏమి జరుగుతుంది?'' అని ఆ ప్రముఖునికి సలహా ఇచ్చారట.

**జమీన్‌రైతు వార్త పుణ్యం?**

అసలీ విషయం పత్రిక ద్వారా వెలువడడం వల్లనే కదా ఆ ప్రముఖులకు ముందుగా తెలిసి, ఆ పథకాలను భగ్నం చేయడానికి వీలయ్యింది? ముందుగా తెలియక పోతే మద్రాసులోనే ఆ షూటింగ్‌లు ప్రారంభమయ్యేవేమో! నంది అవార్డుల సభలో ముఖ్యమంత్రి వినోదపు పన్ను రాయితీలో ఎనిమిది శాతం రద్దుచేస్తున్నట్లు ప్రకటించి నప్పుడే సినిమా రంగంలో తుఫాను చెలరేగింది. ముఖ్యంగా ఆర్థిక నిర్మాణ వ్యయాన్ని దృష్టిలో వుంచుకుని పై నిర్మాతలు మద్రాసులో చిత్ర నిర్మాణానికి ఉపక్రమించారు. మరికొందరు నిర్మాతలు కూడా మద్రాసు పరిసరాల లోనే చిత్రనిర్మాణం చేయాలని అనుకుంటున్నారు. వీరంతా ముందుగా తెలిస్తే, వీరి చిత్రాలు కూడా స్వరాష్ట్రానికి తరలించేందుకు ప్రయత్నాలు జరగొచ్చు. ఒకరు ఇద్దరు అయితే ప్రయత్నాలకు భగ్నం కల్గించ వచ్చు. కాని, ఎక్కువ మంది అయితే? ఎదురు చూడవలసిన విషయమిది.

# కొత్త సినిమాకు పాత వాల్ పోస్టరు

ఒక విషయం మాత్రం అందరూ విస్తారంగా చెప్పు కుంటున్నారు. చాలా నగరాలలోని థియేటర్‌లలో కొత్త చిత్రం ప్రదర్శింప బడుతున్నా హాలుబయట ఏదో మూల పాత చిత్రం పోస్టర్ వుంచుతున్నారు. కొత్త చిత్రానికి చూపవలసిన పన్నుకు బదులు పాత చిత్రానికి వర్తించే దొంగలెక్కలు చూపించడానికి ఈ లోపాయికారీ చేష్టలట! అన్యాయం ఇలా జరిగి పోవల్సిందేనా? దీనిని అరికట్టే నాధుడే లేడా? చిత్ర పరిశ్రమకు ప్రోత్సాహాలు అంటూ రాయితీలు ఇచ్చే ప్రభుత్వపు బొక్కసానికే ఇలా గండి కొట్టడమా? వినోదపు పన్ను రాయితీల పేరిట కొందరు కుమ్మక్కై ఇలా దోచుకోవడం వల్ల పంచాయితీలు, మునిసిపాలిటీలకు ఎంత అన్యాయం జరుగుతోంది? అవినీతి, లంచగొండితనం, పట్ట బద్ధమయి పోయాయేమోనని అన్పిస్తుంది ఈ దోపిడీ చూస్తుంటే. ఒక్క అధికారికూడా ఈ దుర్మార్గాన్ని ప్రశ్నించిన వార్త విన్పడడంలేదు. ముఖ్యమంత్రి దృష్టికి ఈ విషయం పోకినా కూడా ఆయన ఈ 'తతంగం అనివార్యమని' నిమ్మకు నీరెత్తినట్లు ఉండిపోతున్నారేమోనని పలువురు అనుకోవడం సహజమే. ''సి.ఎం. గారికి తలకు మించిన సమస్యలున్నాయి. ఇటువంటివి ఎక్కడ పట్టించుకుంటారు'' అని అవినీతి పరుల ధీమా!

## థియేటర్ల దోపిడీ!

చిత్రాలు తీసే నిర్మాతలు అదృష్టవంతులు. తామనుకున్న రీతిలో, తమ బడ్జెట్‌కు, కథకు అనుగుణంగా ఆ హీరోల చేత వెరైటీ పాత్రలు ధరింప జేయవచ్చు. కాని, కొందరు అభిమాన సంఘాలవారు తమ హీరో ఎప్పుడూ ఒకే రకమైన చిత్రాలు చేయాలని శాసిస్తున్నారు. ఇది ఒక విధంగా తమ హీరోలకు 'ఇమేజ్' పేరుతో అభిమాన సంఘాల వారు పెట్టే ఆంక్ష అనుకోవలసిందే. అసలు మేము సినిమాలు తీసేది ఈ అభిమానుల కోసమేనా? మమ్మల్ని ఆదరించేది సహృదయులైన ప్రేక్షకులందరూకాదా''. అని ఒక నిర్మాత బాధ పడుతూ అన్నారు.

## అభిమానుల వీరాభిమానం!

''ఏ ఇమేజ్ లేని హీరోలతో ఇటీవల కొన్ని అభిమాన సంఘాల వారు తన కంపెనీకి వ్రాసిన ఉత్తరాలు చూపాడాయన.''ఫలానా హీరో చిత్రం పాటను ఫలానా విదేశంలో షూట్ చేశారు. మీరు కూడా మా హీరో పాటలు ఏ విదేశంలోనైనా చిత్రీకరించాలి''. అని కొందరు శాసిస్తున్నారట. వీళ్లకేం తెలుసు మా బాధలు? అసలు వీళ్ళందరూ కలిసి వాళ్ళ అభిమాన హీరోతో ఒక సినిమా తీస్తే తెలిసొస్తాయి మా సమస్యలు. మన ప్రభుత్వం మన రాష్ట్రంలోనే షూటింగ్‌లు జరపాలి అంటే- ఈ అభిమాన సంఘాల వారేమో విదేశాలలో పాటలు షూట్ చేయాలంటారు. అసలు ఒక్కోసారి నాకే అనుమాన మొస్తూంటుంది. నాచిత్రానికి నేను నిర్మాతనా- కాదా అని అన్నాడా నిర్మాత! ఈ వీరాభిమానులకు తగు సలహాలిచ్చి నచ్చచెప్పవలసిన బాధ్యత హీరోల మీద కూడా వుంది.

## ఒక కేరెక్టర్ ఆర్టిస్టు బాధ

''రాధ అక్క అంబిక హాయిగా పెళ్ళి చేసుకుని అమెరికా వెళ్ళిందా ? అక్కడామె భర్త ఇంజనీరు. హాయిగా ఉండొచ్చుగా? ఇద్దరు పిల్లలను కన్నాక మళ్ళీ సినిమాలలో నటిస్తానంటూ మన దేశానికి తిరిగొచ్చి, అక్క పాత్రలు, అమ్మపాత్రలు వేస్తూ, మా వంటి వాళ్ళ నోట్లో మట్టి కొడ్తున్నది? ఆమె భర్త సంపాదించే డబ్బులు చాలవా? డబ్బుకోసం మొగుడ్ని వదిలొచ్చి మా వేషాలు కాజేస్తూ, మళ్ళీ అమెరికా వెళ్లి

కొరవ 11 వ పేజిలో

## కవిత ముఖంలో కళ

ఒకప్పుడు నాయిక పాత్రలు ధరించి, ఇప్పుడు వదిన, తల్లి, అత్తవేషాలు వేస్తున్న కవిత ఒక ఔట్‌డోర్ షూటింగ్‌కు అవసోపాలు పడుతూ వచ్చింది. ''చిన్న ఆపరేషన్ చేయించుకున్నాను. కుట్లు కూడా విప్పలేదు. ఇంతలో హడావిడిగా ఈ షూటింగ్ అన్నారు. కాంటినేషన్.. తప్పదుగా. ఏకాయెకిన నేను బయలుదేరి వచ్చానా? హీరో హీరోయిన్‌లు ఇంకా రాలేదు. నేను హీరోయిన్ వేషాలు వేసేటప్పుడు ఒంట్లో నలతగా ఉన్నా ఠంచన్‌గా స్టూడియోలో ఉండేదాన్ని. ఒక రోజు 103 డిగ్రీల జ్వరంలో కూడా షూటింగ్‌లో పాల్గొన్నాను. మా ఫామిలీ డాక్టర్ నా మీద కోప్పడ్డారు కూడా''.అంటున్న కవిత చుట్టూ షూటింగ్ చూడ్డానికి వచ్చిన కొందరు అమ్మలక్కలు మూగి, ఏవేవో ప్రశ్నలడగసాగారు. ఇంతలో అసోసియేట్ డైరెక్టర్ వచ్చి ''హీరో హీరోయిన్‌లు వచ్చేలోగా మీ క్లోజప్ షాట్లు తీస్తామనగానే ''నేను రెడీ,'' అంటూ కవిత లేచింది. అప్పుడామె ముఖం ఎంతో ప్రకాశవంతంగా వుండింది. మొదటి నీరసం కనిపించలేదు. మాటల సందర్భంలో ఒక అభిమానురాలు ''ఈ చిత్రంలో మీరా హీరోయిన్?'' అని అడిగిందట! అదీ ఆమెను ఉప్పొంగించిన ఆ విషయం!

# దివ్యంగా వుంది - బంగారు మొగుడు

తమ్మారెడ్డిభరద్వాజ దర్శకత్వంలో రూపు దిద్దుకున్న అమూల్య ఆర్ట్సువారి ''బంగారు మొగుడు'' చిత్రంలో పాటల రచయిత భువనచంద్ర, సంగీత సారథి విద్యాసాగర్, ఛాయాగ్రాహకుడు కె. శ్రీనివాసరెడ్డి ప్రాముఖ్యతను పొందారు. సాహిత్యపు విలువలను సంతరించుకున్న భువనచంద్ర వ్రాసిన ''నీ కాలిఅందె ఘల్లు ఘల్లు మంటుంటె'', ''అమ్మాయి కళ్ళు పెద్దవి'', ''అందాలరాశి'' పాటలకు విద్యాసాగర్ సంగీత సొగసులను అద్ది కమ్మదనాన్ని పులిమాడు. రసరమ్యంగా వున్న ఈ పాటల దృశ్యాలను తన కెమెరా నైపుణ్యంతో కె. శ్రీనివాసరెడ్డి సర్వ జనాకర్షణీయంగా చిత్రీకరించాడు. ముఖ్యంగా సుమన్, భానుప్రియలు అందమైన జంటగా ఆడుతూ పాడుతూ వున్నప్పుడు, ఆ సుందర ప్రదేశాన్ని, వారి మత్తెక్కిన మనసులను, వారి కోర చూపులను, నునుసిగ్గును కన్నుల పండువగా చూపాడు. అలాగే ముగ్గురు హీరోయిన్లకి గోపికలను చేస్తూ, హీరోను కృష్ణునిగా చూపుతూ వారికి ఒక పాటను జతచేసి చదరంగంలో పావులను కదిలించినట్లు దర్శకుడు వారిని కదిలిస్తుంటే ఆ కురుపులు, ఆ కదలికల సన్నివేశాన్ని కెమెరా అందంగా ఆకర్షణీయం చేసింది. ఈ దృశ్యం ప్రేక్షకులను బాగా అలరిస్తుంది.

**చిత్రసమీక్ష**

గ్రిద్దలూరు గోపాలరావు

జనార్దన మహర్షి వ్రాసిన కథలో శరణ్య (సురభి) రాణి(మాలాశ్రీ), అమూల్య (భానుప్రియ) అనే ముగ్గురు హీరోయిన్లను సృష్టించాడు. ఈ ముగ్గుర్నీ మూడు కోణాలనుంచి హీరో రామకృష్ణ (సుమన్) మీదకు ప్రయోగించాడు. శరణ్య కాలేజి రోజుల్లో రామకృష్ణను ప్రేమిస్తుంది. పెళ్ళి చేసుకోవాలను కుంటుంది. కానీ అది జరగదు. వాతావరణం వక్రించడంతో అమూల్య రామకృష్ణకు భార్య అవుతుంది. కాలేజి రోజుల్లో రామకృష్ణ ప్రేమ వ్యవహారాలు తెలుసుకున్న అమూల్య, రామకృష్ణను అసహ్యించుకుని దూరంగా వెళ్లి పోతుంది. దానితో విసుగెత్తి ఉద్యోగాన్వేషణలో విశాఖపట్టణం చేరుకుంటాడు రామకృష్ణ. అక్కడ అనుకోకుండా రాణి అనే అల్లరి పిల్ల తటస్థపడడం, ఆమెతో తగాదా పడడం జరుగుతుంది. అనుకోకుండానే రాణి ఇంట్లో అద్దెకు చేరుతాడు రామకృష్ణ. రాణి రామకృష్ణను గాఢంగా ప్రేమిస్తుంది. పెళ్లి చేసు కోవాలను కుంటుంది.

ఉద్యోగం కోసం ఒక ఆఫీసుకు వెళ్తాడు రామకృష్ణ. అక్కడ అధికారిణిగా వున్న శరణ్యను చూసి ఆశ్చర్యపోతాడు. శరణ్య తన ప్రేమను తిరగ తోడి రామకృష్ణ వెంట పడుతుంది. ఇలా ఒక హీరోకు ముగ్గురు హీరోయిన్లు తయారయ్యారు. రామకృష్ణకు ఇదివరకే అమూల్యతో వివాహమైన విషయం, అమూల్య దూరమైన విషయం తెలుసుకున్న శరణ్య, రాణి ఒక పథకం ప్రకారం అమూల్యను రామకృష్ణతో కలిపి వారి సంసారం నిలబెడ్తారు.

ముగ్గురు హీరోయిన్లు చిత్రానికి మంచి ఆకర్షణ. ఈ మూడు పాత్రలను చిత్రానికి ఒక అలంకారంగా చేసి ప్రేక్షకులను పరవశింప జేశాడు దర్శకుడు. అమూల్య రామకృష్ణలను

కొరవ 11 వ పేజిలో

## ఛాన్సుల్లేవని కనక కినుక!

''మా అమ్మ దేవిక ఎన్.టి.ఆర్ గారి ప్రక్కన ఎన్నో చిత్రాలలో నటించింది. తమిళంలో శివాజీ గణేశన్ ప్రక్కన 35 చిత్రాలలో చేసింది. ఈ తరం హీరోల ధోరణి వేరు. ఒక సినిమాలో రోజా; మరో సినిమాలో రంభో, ఆమనో; ఆ తర్వాత మూడో చిత్రం నుంచి నగ్మా, జూహీచావ్లా-వంటి బొంబాయి తారలు కావాలంటారు. ఇది బొంబాయి తారల సీజన్. వీళ్ళ చిత్రాలు ఒకటి రెండు ఫెయిల్ అయితే హాలీవుడ్ తారలను బుక్ చేసుకుంటారేమో! ఒక చిత్రం బాగా ఆడక పోవడానికి ఎన్నో కారణా లున్నాయి. ఇది తెలిసి కూడా పెరటి చెట్టు మందుకు పనికి రాదని అనుకుంటే ఎలా?'' అన్నది కనక.

## రమ్యకృష్ణ ప్రారంభించిన ఆలయం

నెల్లూరు కృష్ణయ్య కూతురు రమ్యకృష్ణ నేడు అఖిల భారత తార. ఈమె జూలై 31 వ తేది ఉదయం హైదరాబాద్ జూబ్లీ హిల్స్ ఫిలింనగర్ కాలనీలో తన అభిమానులు నిర్మించిన రాజేశ్వరీదేవి గుడికి ప్రారంభోత్సవం చేసి ధన్యురాలైంది. గుడిలోని విగ్రహానికి ఈమె పోలిక లున్నాయేమోనని కొందరు పని గట్టుకుని నిశితంగా పరిశీలించారట.

## నెల్లూరు సబ్ జడ్జి కోర్టులో

E.P. No. 7/88 :: O.S. No. 15/78

కర్రం కృష్ణారెడ్డి -పిటీషనరు/డిక్రీహోల్డరు

ఎదిరి

1. సయ్యద్ అమీనాబీబి (Died)
2. సయ్యద్ జిలాని బాషా
3. సయ్యద్ రహీముద్దీన్
4. సయ్యద్ కాశిం (Died)
5. సయ్యద్ అబ్దుల్ హమీద్
6. ఎస్.డి. వకీలా బేగం ఆఫ్ ఆఫ్రీన్ బాన్

-రెస్పాండెంట్లు/జడ్జిమెంటు డెటా ర్లు

## వేలం ప్రకటన

పై నంబరున ఈ క్రింది షెడ్యూలు దాఖలా Item No. 1 మరియు Item No. 2 స్థిరాస్తులను 12.9.94 తేది ఉదయం 10.30 గంటల నుండి పై కోర్టులో బహిరంగ వేలము వేయబడును. కనుక పాటదారులు, వేలములో పాల్గొని పాటపాడుకొనవచ్చును.

## షెడ్యూలు

ఐటమ్ నెం. 1: నెల్లూరు జిల్లా, నెల్లూరు రిజిస్ట్రేషను, నెల్లూరు సబ్ రిజిస్ట్రేషను, నెల్లూరు టౌను, రంగనాయకుల పేట లోని వార్డు నం. 7 ఇంటి నంబరు 57, 6 అంకణముల పాత మిద్దె ఇల్లు మరియు 6 అంకణముల ఖాళీ స్థలమునకు ...

తూర్పు: సయ్యద్ రహమాను ఇల్లు, దక్షిణం: జకీరా ఇల్లు, పడమర: మశీదు సందు, ఉత్తరం: మశీదు రోడ్డు కొంత వరకు, మరియు సయ్యద్ రహీం మొహిద్దీన్ ఇల్లు కొంత వరకు.

డిక్రీ హోల్డరు క్రయం. రూ. 25,000/-

అమీనా విలువ. రూ. 30,000/-

ఐటెం నం. 2 నెల్లూరు జిల్లా, నెల్లూరు రిజిస్ట్రేషను, సబ్ రిజిస్ట్రేషను, నెల్లూరు టౌను, రెడ్డిగుంట రోడ్ లోని వార్డు నం. 6, పాత డోరు నంబరు 568, కొత్త డోరు నంబరు 663 గల పాత పెంకుటిల్లు 8 అంకణములు ఖాళీస్థలము సుమారు 30 అంకణములు. హద్దులు:

తూర్పు: షేక్ గౌస్ బాషా ఇల్లు, దక్షిణం: అన్నంసుబ్బయ్య ఇల్లు, పడమర: షేకిన బాజీ ...మ్మ ఇల్లు, ఉత్తరం: రోడ్డు

డి.హెచ్.ఆర్. క్రయం. రూ. 30,000/-

అమీనా క్రయం. రూ. 50,000/-

టి. రామకృష్ణప్రసాద్,

డిక్రీహోల్డరు అడ్వకేటు, నెల్లూరు

## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

...బ్యాటిసియున్నను పిలిపించి టౌన్‌హాల్ రీడింగ్ రూమ్‌లో గోరింటాకు డిజైన్లు ... ఈ కార్యక్రమానికి ... అందచందాల మీద మగువలకుండే మక్కువ అర్థంచేసుకోవచ్చు. ఈ గోరింటాకు పెట్టే కార్యక్రమాన్ని లేడీస్ క్లబ్ ప్రెసిడెంట్ ఎ. ప్రమీలా రాణి, కార్యదర్శి జి. అనూరాధ, కోశాధికారి ఉషారాణిలు పర్యవేక్షించారు.

### రంగనాయకుల పేటలో కాంగ్రెస్ పతాకావిష్కరణ

రంగనాయకుల పేటలో జిల్లా దూదేకుల సంఘం ఆధ్వర్యంలో 14తేది జరిగిన కార్యక్రమంలో జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవరెడ్డి పార్టీ పతాకాన్ని ఆవిష్కరించారు. అనంతరం హాజీ హైదర్ సాహెబ్ అధ్యక్షతన సభ జరిగింది. పార్టీ అభివృద్ధికి కార్యకర్తలు చేయ వలసిన కృషిని డిసిసి కార్యదర్శి దేవూరు దేవకుమార్ రెడ్డి వివరించారు. కార్యక్రమంలో దూదేకుల సంఘం అధ్యక్షుడు షేక్ శిలార్ సాహెబ్, యువజన కాంగ్రెస్ నాయకుడు సునీల్‌కుమార్ రెడ్డి, సయ్యద్ అక్రం, మాజీ కౌన్సిలర్ గౌస్ మొహిద్దీన్ తదితరులు పాల్గొన్నారు.

### సద్భావన పరుగు

దివంగత ప్రధాని రాజీవ్ గాంధీ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని 'ఇండియా ఫిట్ అండ్ స్ట్రాంగ్' నినాదంతో సద్భావనా పరుగును 20తేది జిల్లా యంత్రాగం ఏర్పాటు చేసింది. ఉదయం ఆరు గంటలకు సర్వోదయ కాలేజ్ గ్రౌండ్ నుండి బయలుదేరి ఏసి స్టేడియం చేరుతుంది. టౌన్‌లోని అన్ని పాఠశాలల విద్యార్థినీ, విద్యార్థులు, ఎన్‌సిసి, ఎన్ఎస్ఎస్, నావల్ క్యాడెట్స్ జిల్లా అధికారులు ఈపరుగులో పాల్గొంటారు. ఆసక్తిగల టౌన్ వాసులను పరుగుకు రమ్మంటున్నారు జిల్లా రెవిన్యూ అధికారి జి. నారాయణ, నెహ్రూ యువకేంద్రం సుధాకరరెడ్డి.

### అందరికీ పామొలిన్

ఆగస్టు నెల కోటాగా జిల్లా అంతటా పామొలిన్ పంపిణీ చేస్తారు. కేజి 28 రూపాయల చొప్పున మునిసిపల్ ప్రాంతాలలోని తెలుపు రంగు కార్డుల వారికి కేజి, గులాబిరంగు కార్డువారికి 2కేజీలు ఇస్తారు. మిగిలిన గ్రామ ప్రాంతాల వారికి అరకేజి లెక్క పంపిణీ చేస్తారని జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర చెప్పారు.

### సారంలేని స్వాతంత్ర్య సింహపురి మైనార్టీస్ అసోసియేషన్ ర్యాలీ

ముస్లిలను బిసిలలో చేర్చాలని సింహపురి మైనార్టీస్ వెల్ఫేర్ అసోసియేషన్ 10తేది ర్యాలీ నిర్వహించి, అనంతరం కలెక్టరేట్ వద్ద ధర్నా నిర్వహించింది. కార్యక్రమంలో మాజీ కౌన్సిలర్లు సందాని భాషా, షఫీ, ఇబ్రహీం, సయ్యద్ జమీర్ అహ్మద్, డాక్టర్ కరిముల్లా, లెక్చరర్ వహాబ్ సాహెబ్ తదితరులు పాల్గొన్నారు. వీరి ఆధ్వర్యంలో నెల్లూరులో త్వరలో మరో ముస్లిం మహాసభ జరుపుతారట.

### టవున్ వడ్డెర యువజన కమిటీ

నెల్లూరు టవున్ వడ్డెర యువజన సంఘం అధ్యక్షునిగా వడ్డే శివకుమార్‌ను, ప్రధాన కార్యదర్శిగా వడ్డే ప్రసాద్‌ను ఎన్నుకొన్నారు. మిగతా కమిటీ ఎన్నిక తరువాత నిర్వహించ నున్నట్లు జిల్లా వడ్డెర యూత్ అధ్యక్షులు ఎం.ఎస్. బాబు చెప్పారు.

### పారిశుద్ధ సిబ్బందికి పునరావాసం!

దర్గామిట్టలోని డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ భవన్‌లో 6 తేది రైట్స్ స్వచ్ఛంద సంస్థ పారిశుద్ధ్య పని వారల పునరా వాసం కోసం ఒక సదస్సు నిర్వహించింది. సదస్సులో జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర మాట్లాడుతూ ఒక వర్గం వారే పాకీ పని చేయాలనే ధోరణి మంచిది కాదన్నారు. పారిశుద్ధ్య పని వారల జీవన స్థితి గతుల్లో పొదుపు లక్ష్మి, అక్షరాస్యత కార్యక్రమాల ద్వారా మార్పు తీసుకు రావాలని రైట్ సంస్థ సభ్యులను కోరారాయన. పాకీ పని వారి సంక్షేమం కోసం ప్రభుత్వం అనేక కార్యక్రమాలు చేపడు తోందని చెబుతూ రుణాలు, ఇతరత్రా సమస్యల విషయంలో నేరుగా సంబంధిత అధికారుల దగ్గరకు పోయి పరిష్కరించు కోవాలని సూచించారు. ప్రధాని రోజ్‌గార్ యోజనా పథకం క్రింద వుపాధి పొందేందుకు ముందుకు వస్తే తప్పకుండా అవకాశం ఇస్తామని జాయింట్ కలెక్టర్ హామీ ఇచ్చారు. టౌన్ డి.ఎస్.పి. లక్ష్మిరెడ్డి మాట్లాడుతూ పాకీ పని వారల దగ్గర నుంచి అక్రమంగా వడ్డీ వసూలు చేసే వారి పైన కఠిన చర్యలు తీసుకొంటా మన్నారు. దీని కోసం జీతాలు ఇచ్చే రోజున అన్ని డివిజన్ల వద్ద తమ సిబ్బందిని కాపలా వుంచు తామన్నారు. సభకు అధ్యక్షత వహించిన రాష్ట్ర ఎస్సి, ఎస్టి, బిసి సంక్షేమ సంఘం ప్రధాన కార్యదర్శి టి. జయపాల్ మాట్లాడుతూ టౌన్‌లోని రామ్‌నగర్, కోటమిట్ట, బ్రహ్మానంద పురం, క్రాంతి నగర్‌లోని పారిశుధ్య పనివారలకు పునరావాసం కల్పించాలని కోరారు. సభలో ఎస్.సి. కార్పొరేషన్ అసిస్టెంట్ డైరక్టర్ వి. సుబ్రహ్మణ్యం, పరిశ్రమల శాఖకు చెందిన ఎస్. చెంచయ్య తదితరులు ప్రసంగించారు.

### నెజ్సా పోటీల్లో విజేతలు

నెల్లూరు జయసుధ ...శిక అకాడమి పదవ వార్షికోత్సవం కస్తూర్బా కళాక్షేత్రంలో 6, 7 తేదుల్లో జరిగింది. ఈ సందర్భంగా నిర్వహించిన లలిత, సినీ, జానపద సంగీతం ఏకపాత్రాభినయ పోటీలకు రాష్ట్ర నలుమూలల నుండి భారీ సంఖ్యలో కళాకారులు హాజరయ్యారు. తొలి రోజు కార్యక్రమానికి వ్యాఖ్యాతగా శ్రీ గౌరి శ్రీనివాసన్, మరు రోజు వర్ధమాన సినీ నటి సుచిత్ర జ్యోతిని వెలిగించారు. అనంతరం జరిగిన పోటీల్లో బ్రేక్ డాన్సు జూనియర్ విభాగంలో విజయ కృష్ణ, రవిరాజా, రఫీయుద్దీన్, సీనియర్స్ టి. రాజేష్ జనార్దన్, ఎం.ఎల్. సాయి బహుమతులు పొందారు. శాస్త్రీయ నృత్యాలలో ఎం.ఎస్. ఆషా, టి. హరిత, అఖిల గెలుపొందారు. సినిమా గ్రూపు డాన్సుల్లో రాజేష్, సురేష్ బృందాలు విజేతలుగా నిలిచారు. సినిమా సంగీతంలో ఆర్. దివిజ, ఆర్. మురళి కృష్ణ, యు. సుజాత వరుసగా మూడు స్థానాలు పొందారు. ఏక పాత్రాభినయ పోటీల్లో సత్యహరిశ్చంద్ర పాత్ర పోషించిన తోట వెంకటేశ్వర రావు, నో వెకెన్సీ పాత్రధారి కె. సరస్వతి, మయసభ సీను ప్రదర్శించిన వి. కోదండ రామయ్య విజేతలుగా నిలిచారు. ప్రత్యేక అంశాలుగా ప్రవేశ పెట్టిన పాశ్చాత్య సంగీతంలో ప్రసన్న కుమార్ బృందం, సారా అక్షరసత్య అంశంలో కన్నమ్మ బృందం ప్రత్యేక బహుమతులు పొందారు. విజేతలకు ప్రభుత్వ సంగీత నృత్య పాఠశాల ప్రిన్సిపాల్ కె. శేషాద్రి నెజ్సా వ్యవస్థాపక కార్యదర్శి ఎ. సుధాకర్ బహుమతు లందజేశారు. చిత్తూరు మిమిక్రీ కళాకారుడు కె. విజయ కుమార్ జోకు ప్రేక్షకులలో మంచి స్పందన లభించింది.

### రిక్షా కార్మికులకు దుస్తులు

జిల్లాలోని రిక్షా కార్మికులకు వుచితంగా ప్రభుత్వం దుస్తులు పంపిణీ చేస్తుంది. జిల్లా వ్యాప్తంగా వున్న రిక్షా కార్మికులు తమ పేర్లను తమ పరిధిలోని రెవిన్యూ కార్యాలయాల్లో నమోదు చేసుకోవాలి. ఆ సమాయల్లో తప్పని సరిగా కార్మికుల వద్ద రిక్షా వుండాలి. 15 తేది తరువాత ఒక జత దుస్తులు చొప్పున పంపిణీ చేస్తామని జిల్లా కలెక్టర్ ఎం. సాంబశివ రావు తెలియ జేస్తున్నారు.

### బళ్లారిరాఘవ జయంతి

కళ ప్రజ కోసమే అన్న సత్యాన్ని అక్షరాలా నిరూపించిన మహా నటుడు బళ్లారి రాఘవ 114 వ జయంతి సభను దొడ్ల పద్మావతమ్మ మహిళా గ్రంథాలయంలో కళాసుధ సంస్థ ఘనంగా జరిపింది. వర్ధమాన సమాజం అధ్యక్షులు పి.వి. రమణారెడ్డి అధ్యక్షతన జరిగిన సభలో వుపన్యాసకులు డాక్టర్ పెళ్లకూరు రవీంద్ర రెడ్డి, రాఘవ సహజా వైదుష్యాన్ని కొనియాడారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన సమాచార పౌరసంబంధ శాఖ ఉపసంచాలకులు నాగభూషణం ఒకనాటి నాటక రంగ వైభవాన్ని గూర్చి చెబుతూ రాఘవకు రాఘవే సాటన్నారు. నటుడుగా, న్యాయ...గా, సంఘ సంస్కర్తగా, మానవతా మూర్తి... రాఘవ చిరస్మరణీయులని అధ్యక్ష స్థాన మలంకరించిన పివి రమణా రెడ్డి అన్నారు. డబ్బింగ్ ఆర్టిస్ట్ సాయి కిషోర్ రాఘవకు అత్యంత ప్రీతి పాత్రమైన రుస్తుం పాత్రను అభినయించి ప్రముఖ సినీ దర్శకులు కమలాకర కామేశ్వర రావు చేతుల మీదుగా సన్మానం స్వీకరించారు. లెక్చరర్ తిరుమూరు సుధాకర్ రెడ్డి రాఘవ అభినయం మీద ఉపన్యసించి సన్మానం స్వీకరించారు. కళాసుధ అధ్యక్షురాలు శ్రీమతి డి. శైలజా రెడ్డి, ఆర్. పెంచల్ సింగ్ సభలో మాట్లాడారు. సంస్థ కార్యదర్శి వైద్యుల శ్రీనివాస రావు చివరన వందన సమర్పణ చేశారు.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

ఎన్నుకోబడ్డారు.

హెడ్‌మాస్టర్ల తరపున నిల్చిన కనుపర్తి సుబ్రహ్మణ్యంగారు కొద్ది తేడాతో ఓడిపోయి, యలమంచిలి బోర్డు హైస్కూలు హైడ్‌మాస్టరు నారాయణ రావుగారు, బందరు హిందూ కాలేజి హైస్కూలు హెడ్‌మాస్టరు వి. రామయ్యగారు గెల్చారు.

-విమర్శకుడు

## పెళ్లిళ్ల పురాణం

ఈ పెళ్లిళ్ల పురాణాన్ని గూర్చి కొందరికి రుచి భేదాలున్నట్లుంది. ఇది లోకసహజమే. మా అభిప్రాయ మేమిటంటే సంఘంలోని దురా చారుల్ని తగ్గించాల్నని. సదాచారాలను పెంపొందించాల్నని. అంతేకాని జరిగే పొరపాట్లను, తప్పులను ఆక్షేపించాలనికాదు. మేము సంఘదృష్ట్యా చూస్తామేకాని వ్యక్తి నిమిత్తమాత్రమే. కాబట్టి ఎవరేమనుకొన్నా అవకాశమున్నప్పుడు, వీలున్నప్పుడు మా పురాణం సాగిస్తూనే వుంటాము. నలుసులున్న తీసివేసి మధువునే గ్రహించండి.

* * *

రెడ్లలో పెండ్లికట్నాలబాధ తగ్గలేదు. భరించగలిగిన కుటుంబాల విషయం ఒకమాదిరికాని, భరించలేని కుటుంబాల బాధ వర్ణనాతీతము.

"వెలయాలు కూతు రల్లుడు
ఇలయేలకయాచకుండు విపురుధరలో
కలుములు లేములు దలపరు
విలసితముగ కీర్తికామ వినరావేమా"

దీన్ని సార్థక పరు స్తున్నారన్నమాట.

నెల్లూరులో రేషనింగు అముల్లోవుంది. 30 భోజనాలకంటె అవకాశముండదు. అందువల్ల ఇక వేణుగోపాలస్వామి దేవళం కంటె పత్తివారి తోట పెళ్లి మంటపంగా మారవచ్చు. అక్కడ రేషనింగు బాధలేదు.

4తేదిన వేణుగోపాలస్వామి దేవళంలో జరిగిన దేహూరు రెడ్ల వివాహానికి 2,3 వేలమంది బంధుమిత్రాదులు వచ్చినా భోంచేసింది 30 మందేనన్న మాట. భోజనం ఖర్చులు తగ్గించుకోదలచుకునేవారు నెల్లూరులో వివాహాలు జరుపుకోడం మంచిది.

- చిత్రగుప్తుడు

# ఆగస్టు 15 సంబరాల్లో ఆడవారికే పొగడ్తలన్నీ!

స్వాతంత్ర్య దినోత్సవ మహోత్సవ సర్కారు మొక్కుబడి అగస్టు 15వతేది నెల్లూరు పోలీసు గ్రౌండ్‌లో యథా ప్రకారం జరిగిపోయింది. కొత్తదనమంటూ ఏమీలేదు; అంతా యాంత్రికతే. స్కూల్ పిల్లలను తరలించుక రావడంతో షామియానాలలో నెల్లి కనపడకుండా పోయింది. ఎప్పుడూ చురుకుగా వుండే జిల్లా కలెక్టర్ శ్రీ ఎం.సాంబశివరావు ఎందువల్లో ఈసారి తొట్రుపడ్డారు. తన ఉపన్యాస పాఠంలో ఒక పేజీ చదవడం కూడా మర్చిపోయారాయన. తెలుగు భాష అమలుకు ప్రత్యేక సంఘాన్ని ఏర్పాటుచేసి ప్రభుత్వం పాకులాడుతుంటే, అదేమిటో మన అధికారులకు 'శ్వేతభాషే' రుచి. అవార్డు అందుకొన్న అధికారుల పనితీరు గూర్చి జనానికి అర్థంకాని ఇంగ్లీషులో కష్టపడి చెప్పే బదులు స్పష్టంగా తెలుగులో చెబితే ఏమి పోతుందండి? సాయంత్రం కస్తూర్బా కళాక్షేత్రంలో ఏర్పాటు చేసిన సర్కారీ సాంస్కృతిక కార్యక్రమాలు చూచిన వాళ్లు తల పట్టుకొని బయటకు వచ్చారు. అర్జంటుగా అమృతాంజనం కొనుక్కోవడానికి! జాతీయ పండుగ దినాల్లో నైనా మంచి కార్యక్రమాలు ఏర్పాటు చేయలేనంత గొడ్డుపోయిందా జిల్లా సాంస్కృతిక మండలి?

48వ స్వాతంత్ర్య దినోత్సవాన జాతీయ పతాకాన్ని ఆవిష్కరించి, వందన స్వీకారం చేసి పరామామూలుగా అభివృద్ధి పాఠం చదివారు కలెక్టరు గారు! అక్షరాస్యతా కార్యక్రమంతో చైతన్య వంతులై, సారా నిషేధంతో ఉత్సాహం పొందిన సింహపురి మహిళలు నేడు పొదుపు

## సారం లేని స్వాతంత్ర్య దినోత్సవం!

ఉద్యమానికి శ్రీకారం చుట్టి దేశం నలుమూలలా జిల్లా ప్రగతిని, ప్రత్యేకతను చాటి చెప్పారు. మహిళలు సాధించలేనిది ఏదీ లేదని చెప్పేందుకు జిల్లాలోనే ఎన్నో తార్కాణాలు చవిచూశాం. జిల్లాలో రెండు లక్షల మంది గ్రామీణ మహిళలు ఆరువేలకు పైగా పొదుపులక్ష్మి సంఘాలుగా ఏర్పడి 2.50 కోట్లు పొదుపు చేసినట్లు వివరించారాయన. సాక్షరతా కార్యక్రమం తదుపరి చర్యగా జిల్లా సాక్షరతా సమితి ఆధ్వర్యంలో ఆరోగ్యదీపం కార్యక్రమం పెద్ద ఎత్తున చేపడుతున్నట్లు చెప్పారు. మొదటగా 400 గ్రామాల్లో దీనిని ప్రారంభించేందుకు ఏర్పాటు చేశారు. ఇందిరా ఆవాస్ యోజన పథకం క్రింద మత్స్యకారులు, బీడీ కార్మికుల గృహ నిర్మాణ పథకాలకు 13,338 ఇళ్లు మంజూరు కాగా 9533 ఇళ్ల నిర్మాణం పూర్తి చేసినట్లు చెప్పారు.

ఈ ఆర్థిక సంవత్సరంలో 53 చిన్న తరహా, మధ్యతరహా మురుగు కాల్వల ఆధునీకరణకు ఐదుకోట్ల రూపాయలు మంజూరై పనులు చురుగ్గా సాగుతున్నట్లు చెప్పారు. వ్యవసాయ రంగంలో గణనీయమైన మార్పులు చోటుచేసుకొన్నాయని, మేలు రకాల వరి ఉత్పత్తిలో విశిష్ట స్థానాన్ని సాధించిన ఘనత నెల్లూరు జిల్లాకు దక్కినందుకు గర్వ పడాలన్నారు కలెక్టర్. మాతమ్మల విముక్తి కోసం ఈ ఏడాది ప్రత్యేకంగా కార్యాచరణ పథకం అమలు చేస్తున్నట్లు చెప్పి ముగించారాయన.

ఈసారి వివిధ రంగాల్లో సేవలు చేసి ప్రశంసా పూర్వక అవార్డులు అందుకున్న జాబితాలో మొట్ట మొదట చెప్పుకోవలసింది కప్పరాళ్ళ తిప్పలో కాపుడు సారా వ్యాపారాన్ని మాన్పించి, అక్కడి వాళ్లను సాధారణ జన జీవన స్రవంతిలోకి తెచ్చేందుకు పలుపాట్లు పడి, రిటైర్డ్ అయిన విడిఓ శ్రీ చిత్తూరు దేవదానం; తరువాత పొదుపు లక్ష్మి ఉద్యమంలో నిద్రాహారాలు మాని కృషి చేస్తున్న డ్వాక్రా అధికారిణి బి. విజయభారతి; ఆరోగ్యదీపం నిర్వహిస్తున్న జి.మాల్యాద్రి; మాతమ్మ దురాచారం అంతానికి కృషిచేస్తున్న మానె వెంగయ్యలు అవార్డులకు అర్హులే.

పోలీస్ అధికారుల్లో డిఎస్‌పి లక్ష్మిరెడ్డి, స్పెషల్ బ్రాంచ్ సిఐ ... వెంకటరెడ్డి, కంపా ప్రసాద్, సబ్‌ఇన్స్‌పెక్టర్‌లలో ఆర్.నాగేశ్వరరావు, గౌస్‌బాష, సాయిప్రసాద్, అవార్డులు పొందారు. 1013 కుటుంబ నియంత్రణా ఆపరేషన్లు చేసిన నాయుడుపేట పి.హెచ్.సి డాక్టర్ ఎన్.జానకి రామయ్య కూడా అఖండుడే. మంచి మార్కులు తెచ్చుకున్న విద్యార్థులలో జి. కిరణ్ కుమార్, ఐ. వెంకటేశ్వర్లు, ఎం. గోపాల నరసింహం, సురేంద్రబాబు, సాయి పద్మల, హరిణి, జయంతి, గీతలను ప్రశంసిస్తూ అవార్డులు ఇచ్చారు. బ్యాంకర్లలో ఆత్మకూరు స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, మేనేజర్ పి. శివరామయ్య; విడిగుంటపాళెం పినాకిని గ్రామీణ బ్యాంక్ మేనేజర్ డి. పోలయ్య చక్కని ప్రతిభచూపి కలెక్టర్ చేతులమీదుగా అవార్డులు పొందారు. జిల్లావ్యాప్తంగా 53మందికి ఈసారి ఈ ప్రతిభా పత్రాలు ఇచ్చారు.



ప్రభాత్ ఇంగ్లీష్ మీడియం స్కూలు స్వాతంత్ర్య దినోత్సవ పతాకావిష్కరణ చేస్తున్న జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర, ప్రిన్సిపల్ కృష్ణ

## సినిమా

9 పేజీ కొరవ

మొగుడితో కులుకుతుందట. ఈ మాత్రం దానికి అమెరికా వదలి పెట్టి రావడం దేనికి?'' అని బాధతో తూలనాడింది సుగుణమ్మ. ''చూడమ్మా! ఈ సినిమా రంగంలో ఇటువంటివన్నీ మామూలే. నువ్వేం పట్టించుకోకూడదు. నీ పని నువ్వు చూసుకుపోవాలి. అంతే!'' అని ఆమెను ఓదార్చాడు ప్రొడక్షన్ మేనేజర్. ''నీకేంలే నాయనా! ఎన్నయినా చెబుతావు. రేపు నీకు పని దొరక్కపోతే అప్పుడు నువ్వు ఇలా బాధపడతావు.'' అంటూ సుగుణమ్మ ఒక చురక వేసింది. అంతే ఆ ప్రొడక్షన్ మేనేజర్ చల్లగా జారుకున్నాడు.

### నాయుడు పేటలో ''భైరవద్వీపం'' రికార్డ్

నాయుడుపేటలో ''భైరవ ద్వీపం'' చిత్రానికి 4 లక్షల 50 వేల షేర్ వసూలై, కొత్త రికార్డు సృష్టించింది. ఈ ఊళ్లో పాత రికార్డు 2లక్షల 90వేలు.



## చిత్రసమీక్ష

9 పేజీ కొరవ

జతకలపడంలో శరణ్య, రాణి అనుసరించిన విధానం, చూపిన ఎత్తులు గమ్మత్తులు ఆహ్లాదకరంగా వున్నాయి. అలాగే అన్ని సన్నివేశాల్లోనూ దర్శకుని భావనా శక్తి గొప్పగా కనిపిస్తుంది. అందుకే చిత్రం విజయవంతంగా తయారైంది.

చిత్రాన్ని చాలా వరకు వ్యాపార ధోరణిలో రూపొందించాడు దర్శకుడు. అయినా ఎక్కడా అశ్లీలానికి దాసోహం అనలేదు. చిత్రంలో సెక్సుబాంబు సిల్కుస్మిత వున్నా, హాస్యం పేర అసభ్యత కనపరిచే బాబూమోహన్ వున్నా, దర్శకుడు ఎక్కడా శృంగారంలోనూ, హాస్యంలోనూ, ఫైటింగుల్లోనూ హద్దుమీరలేదు. అందుకు కొత్త నిర్మాతలైన పురుషోత్తమరావు, గఫూర్ కూడా అభినందనీయులు. మాటల రచయిత తనికెళ్ళభరణి కూడా అసభ్యతకు దూరంగా వున్నందుకు అతనిదో దణ్ణం.

భానుప్రియ కొంతకాలంగా తెలుగు తెరకు దూరంగా వుండి, మళ్ళీ దర్శన మిచ్చి తన గుండ్రని తెల్లని కళ్ళతో ప్రేక్షకులను పలు భావాలతో మధురంగా పలుకరించింది. చిలిపి చిలిపిగా గిలిగింతలు పెట్టింది. ఇంత మంచి నటిని తెలుగు తెర మరచి పోవడం ... సురభి శృంగార పరమైన ఆమె పలుకులతో కులుకులతో ఆనంద పరిచారు. ముగ్గురు హీరోయిన్ల మధ్య నలుగుతూ, ... తన నటనలో నవరసాలను పండించారు సుమన్. అమూల్య తండ్రిగా గొల్లపూడి సహజంగా నటించారు. మిగతా పాత్రల్లో వై. విజయ, రాళ్ళపల్లి బాగా నటించారు.

## కృష్ణపట్నం

మొదటి పేజీ కొరవ

మారలేదు. ఇంకు మెంచుబోఫోర్సుకు సరి సమానమైన కుంభకోణం ఇది. అయితే కృష్ణపట్నం విద్యుత్ కేంద్రం పెట్టుబడిలో కాని, ఆ తర్వాత దాని పై ఆయా కంపెనీలకు లభించే లాభంతో కాని పోల్చితే 45 కోట్లు చాలా చిన్న మొత్తం క్రిందే లెక్క.

విచార కరమైన విషయమేమిటంటే - ఇటు ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయ భాస్కర రెడ్డి, అటు ప్రధాన కార్యదర్శి శ్రీ జయ భారత్ రెడ్డి లిద్దరికీ ఇప్పటి వరకు అవినీతి పరులుగా చెడ్డ పేరు లేదు. ఎన్నికల వ్యయం కోసం స్నేహితుల మీద ఆధార పడడం వంటి సర్వ సాధారణ విషయంలో తప్ప, ఫైలు పై సంతకానికి రేటు పెట్టి బేరం చేసుకొన్న సాదృశ్యం విజయ భాస్కర రెడ్డి సుదీర్ఘ రాజకీయ జీవితంలో ఎప్పుడూ జరగ లేదంటారు. జయభారత్ రెడ్డి కూడాసచ్ఛీలుడుగా పేరు పొందిన వాడే. ఢిల్లీలో బ్యాంకింగ్ వంటి శాఖల్లో కీలక పదవులు నిర్వహించినా ఆయన పై ఎప్పుడూ వివాదాల మచ్చ పడలేదు. కాని ప్రధాన కార్యదర్శిగా రాష్ట్రానికి వచ్చిన తర్వాత ఆయన తరచూ వార్తల కెక్కుతున్నారు. కుల పక్ష పాతంతో పలు నిర్ణయాలు తీసుకుంటున్నారన్నది ప్రథమ అభియోగం. ఇంకొక ప్రక్క ముఖ్యమంత్రి తరఫున రాజకీయ రాయబారులు, సంధానాలు చేయడమూ జరుగు తున్నది. ఎన్టి రామారావు ఇంటి ప్లాన్ అప్రూవల్ విషయంలో వివాదం చెలరేగి నప్పుడు సర్ది చెప్పింది ఆయనే. విజయ భాస్కర రెడ్డి, డాక్టర్ వైఎస్ రాజశేఖర రెడ్డిల మధ్య రాజీ కుదర్చ డానికి ఆయన ఒక మధ్య వర్తి వలె వ్యవహరించారు. మంత్రి మండలి విస్తరణ సమయంలో పేర్ల చిట్టా, శాఖల పంపిణీ జాబితా తయారు చేసింది జయభారత రెడ్డి గారే! అధికారిగా వుండి ఒకరైన ముఖ్యమంత్రి రాజకీయ సచివుడిగా వలె వ్యవ హరించడం పట్ల సెక్రటేరియట్ అధికార వర్గాలలో చర్చలు, అసంతృప్తులు తలెత్తినా, జయభారత్ రెడ్డి పట్ల వున్న గౌరవం కొద్దీ ఎవరూ రచ్చ కెక్కలేదు. ఇంకొక అధికారి ఇట్లా వ్యవహరించి వుండి వుంటే ఈపాటికి గగ్గోలు లేచి వుండేది. కృష్ణపట్నం పుణ్యమా అని ఈ ఇద్దరి మీదా అవినీతి బురద పడింది. టెండర్ల మంజూరు సవ్యంగా జరిగిందని వారు సమర్థించు కొనే కొద్దీ, మరింత లోతుగా వారు ఊబిలో కూరుక పోతున్నారు.

# ఉత్తరక్రియలు



మా యింటి దీపం, మా అభివృద్ధికి కారకురాలు

# శ్రీమతి గుండ్రా రాజమ్మ గారు

15.8.1994 తేది సోమవారం రాత్రి స్వర్గస్థురాలైనది.
ఆమె ఆత్మకు చిరశాంతిని కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

ఉత్తరక్రియలు

2.9.1994 తేది శుక్రవారం -శిలాప్రతిష్ట

3.9.1994 తేది శనివారం - శిలోద్వాసన

నెల్లూరు వెంకట్రామాపురంలోని మా స్వగృహమున జరుగును.
బంధుమిత్రులు తెలియగోరుతాము.

గుండ్రా జనార్ధన రెడ్డి, కుమారుడు

వసుంధర, కోడలు

మనుమడు - మనుమరాలు
బెజవాడ వెంకట్రామ్‌రెడ్డి - కామాక్షి

ముని మనుమలు
బెజవాడ కార్తీక్ రెడ్డి, బెజవాడ కృష్ణ
చైతన్య రెడ్డి,

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,